శ్రీరస్తు

# వివేకానందస్వామిజీవితము





చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

 1952 [Price Rs: 3.00

శ్రీరస్తు

# వివేకానందస్వామిజీవితము



●

చెన్నపురి:
వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు వారిచే
ప్రకటితము.
1952

శ్రీ

# వివేకానందస్వామిజీవితము.



పూర్వమునుండి కలకత్తాలో సిమ్లాయను పేటయందు కాయస్థక్షత్రియులు వసించుచుండిరి. వారు చిరకాలము నుండియు సకలైశ్వర్యములతో నొప్పారుచు దాతృత్వమునందును, పాండిత్యమునందును ప్రఖ్యాతి వహించియుండిరి. ఆ వంశమునకు దత్తవంశ మనియు నామాంతరము గలదు. అందు 18.వ శతాబ్దమున దుర్గాచరణదత్తు జన్మించెను. అతఁడు సంస్కృత పారసీకభాషలయం దసామాన్యపాండితిగలవాఁడై న్యాయశాస్త్రపారంగతుఁడై విలసిల్లెను. సంసారసౌఖ్యముల కెట్టిలోపము లేకున్నను, నిరువదియైదవయేటనే సర్వసంగపరిత్యాగ మొనర్చి రుచ్చుటకో డేగెను.

దుర్గాచరణుని భార్య బాలుఁడగు విశ్వనాథుని దీసికొని పెక్కు తీర్థయాత్రలు చేసివచ్చెను. విశ్వనాథుఁడును పెరిగి పారసీకభాషయందును, ఆంగ్లభాషయందును పాండిత్యమును గడించి, వంశానుగతమగు న్యాయవాదవృత్తి నవలంబించి మంచిపేరును సంపాదించెను. భోగభాగ్యముల ననుభవించుచు, నడిగినవారికి లేదనక ముందువెనుక లాలోచింపక దానధర్మములుచేసి మహాదాత యని ఖ్యాతిగడించెను. ఏవేళఁజూచినను

దనయింట భోజనమునకుఁ బలువురుందురు. బీదసాదుల నేకరీతిగఁ ప్రేమించువాఁడు.

విశ్వనాథునిసతీమణి భువనేశ్వరీదేవి. ఈమె భర్త కన్ని విధములఁ దగినసతి. ఈమె నిత్యము రామాయణమహాభారతములను పారాయణముచేయుచు విశేషాంశములను కంఠస్థము చేయుచుండెడివి. ఆ సాధ్వి తనకు భగవదంశమున సంతానము గలుగవలయు ననుతలంపుచే గాశిలోని వీరేశ్వరునకుఁబూజలు సల్పెను. సదా శివారాధనతత్పరయై ధ్యానమొనర్చుచుండెను. ఒకనాఁడామె పరమేశ్వరుఁడు తనకు పుత్రుని ప్రసాదించినట్లు కలగనెను. గర్భిణి యగునామె శుభముహూర్తమున 1863 సంవత్సరము జనవరి 12 వ తేది, మకరసంక్రమణపుణ్యదినమున నొక బాలుని తేజస్విని బ్రసవించెను.

వీరేశ్వరునియనుగ్రహముచే గలిగినందున నాబాలునికి వీరేశ్వరుఁ డని నామకరణ మొనర్చిరి. కాని బాలునియాకృతి విశేషములఁబట్టి నరేంద్రుఁడని యతనిపితరులు వ్యవహరించుచు వచ్చిరి. అందువలన నతనికి నరేంద్ర నామము ప్రసిద్ధమయ్యెను. మాటలు నేర్చినది మొదలు తల్లి భువనేశ్వరి రామాయణభారతములలోని కథలనుజెప్పి, తాను కంఠస్థ మొనరించినవిశేషాంశములను కుమారునికిఁ జెప్పుచుండునది. ఆబోధనలే యనంతర మతనిని జాతీయవీరునిగను, దేశభక్తునిగను నొనర్చినవి. అతఁ డేదైన పోరుపెట్టినయెడల సమాధానపఱుప నెవ్వరికినిసాధ్యము కాదు. అట్టి సమయమున నతనిమాత 'తనయు నిమ్మని దేవుని ప్రార్థింప నామె యిట్టి నిన్ను ప్రసాదించె' నని యతనితో ననును. అతఁ డంతటితో నూరకుండును. ఇంకొకప్పుడు మొండి

కట్టుపెట్టి అల్లరిచేసినచోఁ జన్నీరు తలపైనిపోయును. ఒకప్పుడల్లరిచేయుచుండిన, దానిని మాన్పుటకై యీశ్వరనామోచ్చారణమును జేసెడిది. అంతటితో నది మాని శాంతించుచుండును. నరేంద్రుఁడు సన్యాసులనుజూచి మిక్కిలి యానందమునందును. వారు కాషాయకమండలువులను ధరించుటఁ జూచి తానును ధరించి వారివలెనుండ నిచ్ఛగొనును. ఐదుసంవత్సరములు వచ్చునప్పటికి భారతరామాయణములలోని విశేషాంశములను దల్లి భువనేశ్వరివద్ద నేర్చుకొనెను. విద్యయం దెంతటిచురుకుదనము గలిగియుండెనో, యట్లే యాటలయందును పాటలయందును మిన్నయై యుండువాఁడు. తండ్రి యేదైన తినుబండారములకై రూకలిచ్చిన దానితో గోలీలు, బంతులు మొదలగు నాటవస్తువులను గొనెడివాఁడు. ఎట్టియాటలయందును తానే మొదటిగెలుపు పొందువాఁడు. గొప్పధైర్యశాలి. పరోపకారి. ఒకసారి నరేంద్రుఁడు వాకిట నాడుకొనుచుండ నొకబైరాగివచ్చి 'జయ్ సీతారాం భిక్షాం దేహి' యని యడిగెను. అది విని తన పైనున్న పట్టురుమాలు నతని కిచ్చివేసెను. పిమ్మటఁ దల్లిదండ్రులు రుమా లెక్కడ నని యడుగ నొకబైరాగి కిచ్చితి నని చెప్పెను. అదిమొదలుకొని నరేంద్రునికి బైరాగి కనుపింపకుండఁ గట్టుదిట్టము చేసిరి.

నరేంద్రుఁ డొకరు చెప్పునది తనకు విరుద్ధమని తోఁచినచో నెట్టివారితోనైనను నెదిరించి మాటలాడు స్వభావముగలవాఁడు. ఒకసారి తండ్రి పేదవారలకు దానము చేయుచుండ నరేంద్రుఁ "డిల యిట్లు వ్యర్థముగ ధనమును పాడుచేయుచున్నా"రని తండ్రినడిగెను. తండ్రి నాయనా! సకలప్రాణుల.

ఉపకరించుటకే భగవంతుఁడు వారల సృజించినాఁడు. వారును మనవంటివారే యని చెప్పెనట. ఒకనాఁడు కోపముచే నరేంద్రుఁడు తల్లిని దూషించెను. అది యెఱిఁగి యతనితండ్రి యతఁ డుపయోగించినదూషణను గోడమీఁద వ్రాసియుంచెను. ఆ వ్రాతచూచినప్పుడెల్ల నరేంద్రుఁడు తనతప్పును దెలిసికొని పశ్చాత్తాపముఁ బొంది లజ్జపడఁజొచ్చెను.

నరేంద్రుఁడు తోడిబాలురతోఁ గ్రీడించునప్పు డందఱ కంటె మిన్నగ నుండును. క్రొత్తక్రొత్తగ నాటలను గనిపెట్టి బాలురకు నేర్పును. అశ్వారోహణము, శకటచోదనమున్న నతనికిఁ గడుఁ బ్రియము. ఒక్కొక్కప్పుడు తాను తలపాగఁ జుట్టుకొని కొరడాను జేతియందుఁబట్టుకొని తనజోడుగుఱ్ఱములఁ దోలుచు నానందించువాఁడు. సన్యాసులను జూచి యొకనాఁడు తానును గాషాయములధరించి శివుఁడు కావలయునను తలంపు గలిగి, యెఱ్ఱనిపట్టురుమాలును గట్టుకొని చిందులుద్రొక్కుచు, 'అమ్మా! నేను శివుఁడను, తపస్సుచేసినచో నాకుఁగూడ తలపై జడలు మొలుచునుగదమ్మా' అని యనుచు నొంటరిగఁగూర్చుండి కన్నులుమూసికొని ధ్యానముచేయుచుండును. ఆ బాలునిఁ జూచి భువనేశ్వరి తాతగారగు దుర్గాచరణునివలె నితఁడును విరాగి యగునేమో యని భయమునందెడిది.

ఒకనాఁడు నరేంద్రుఁడు ధ్యాననిమగ్నుఁడై యుండ నాగ్రాచుపా మచటికి వచ్చెను. అదిచూచి తోడిబాలురందఱు కేకలువేయుచు నరేంద్రుని లెమ్మని పాఱిపోయిరి. కాని భగవద్ధ్యాననిమగ్నుఁడగు నరేంద్రుఁ డిదియేమియు నెఱుఁగఁడు. పిమ్మట నతనితలిదండ్రులు నాయనా! సర్పమున కేల తొలఁగి

పోలేదని యడుగ నేను పామునే చూడలేదని నరేంద్రుఁడు చెప్పెను. నరేంద్రుఁడు రామాయణశ్రవణముచే శ్రీరాముని యందు భక్తిగలిగి, సీతారాములవిగ్రహమును బూజించు వాఁడు, ఒకనాఁ డొకగదియందుఁ గూరుచుండి, లోపల గడియ వేసికొని విగ్రహముల నెదుట నుంచుకొని ధ్యానముచేయ నారంభించెను. బిడ్డయింట కానరాకపోవుటచే తలిదండ్రు లూరం తయు వెదకిరి, గానుపింపలేదు. ప్రత్యేకముగ నున్నగది మూసి యుండుటను జూచి తలుపులను నెట్టిరి. బాదిరి కాని యేమియు బదులులేదు. అంతట వారు తలుపులను బగులఁగొట్టి లోనికేగ ధ్యానమగ్నుఁడై నరేంద్రుఁ డుండెను. అదిచూచి వా రాశ్చర్య పడి, యతని పూర్వపుణ్యుఁడని తలఁచిరి. ఒకయోగి సంసారము వంటిది, అనంతములగు దుఃఖములతోఁగూడినది, కాన వివాహ మనర్థహేతువు అని నుడువుచుండ విని నరేంద్రుఁడు దుఃఖ మూలకమగు నీపెండ్లిని దేవుఁడెందులకాదనని పలుకుచు నతఁడు పూజించుచున్న సీతారాములవిగ్రహములను బాఱవైచి శివుని ధ్యానింపఁదొడఁగెను.

నరేంద్రునకు విద్యాభ్యాస మాఱవయేట జరిగెను. పురోహితుఁడు మంత్రముతో బలపమును పట్టించి కుడి చేతితో అ ఆ లు వ్రాయించెను. నాఁడుమొదలు అతఁడు చాప చంకఁబెట్టుకొని యాకకలమునుబట్టుకొని బడికివెళ్లువాఁడు. అతని కచ్చులు దుష్టసహవాసము కలుగుటచే బడికంపుట మాని యింటియొద్దనే వేఱొకయుపాధ్యాయునిచే జదివించిరి. ఒక సంవత్సరములోపలనే చక్కఁగ జదువ వ్రాయఁగలిగెను. 1869-లో నరేంద్రుని పినతాత శాలిప్రసాదదత్తు (తనమరణా

వస్థయందు) మహాభారతమును జదువుమని బాలకతోఁ జెప్పెను. ఎవ్వరును జదువలేకపోగా నరేంద్రుఁడు భక్తిజ్ఞానములతో జీవుఁడాత్మైక్యమునందునను విషయముంగల గరుడఘట్టమును జదివెను. తాత మనుమని సత్తరుకతను గొండగలవని నుడివెను. ఏడవయేడు వచ్చుసరికి ముగ్ధబోధవ్యాకరణమును, రామాయణభారతములందలి విశేషఘట్టములను గంఠస్థ మొనరించెను.

నరేంద్రుఁ డేకసంథాగ్రాహి. అల్లరిచేయువాఁడయ్యును గురువుచెప్పిన శ్లోకపాఠమునన నర్థముతో, చ తప్పకుండ నొప్ప చెప్పెను. రాత్రులయందు దనబంధువగు నొకమునసబుతాత యొద్ద నరేంద్రుఁడు పరుండువాఁడు. ఆతాత సంస్కృతభాషానిధి యగు నమరకోశమును జెప్పెను. నరేంద్రుఁడు దానిని గంఠస్థముచేసెను.

బాలకుల నాయకుఁడగు నరేంద్రుఁడు మకరసంక్రాంతి దినమున గంగాభవానిని బూజింప దంత్రి యనుమతిఁగొనెను. బాలురందఱకును గావలసినవస్తువులకై కొంతద్రవ్యమును గ్రహించి తాను ముందు నడచుచుండ బాలురందఱు తమ యుత్సాహమును వెలిబుచ్చు గొన్నిపతాకలనుబట్టుకొని బారులుతీరిపోయిరి. గంగాభవానిని బూజించిరి. వారితోఁ జిదప నింటికివచ్చెను. చెడుగుడు, గోలీలు, కుస్తీలుపట్టుట మున్నగు ఆటలయందు ఉత్సాహముకలవాఁడయ్యును బోరాట మనిన నేవగించువాఁడు. బాలుర పోరాడుకొనుచో వారి నడుమ నరసింహమువలె నిరుపక్షముల వారితగవులను దీర్చువాఁడు.

నరేంద్రుఁడు 1870 (అనఁగా దనయేడవయేట) సంవత్సరమున ఈశ్వరచంద్రవిద్యాసాగరునిబడిలో మొదట ప్రవేశించెను. ఏపాఠమునైనను నొక్కసారి విని గ్రహించువాఁడు. తక్కినసమయమంతయుఁ దోడిబాలురతో రామాయణభారత కథలను, క్రీడావిశేషములను జెప్పుచుఁ గాలము గడుపుచుండును. ఒకనాఁడు తరగతిలోఁ బాఠములు జరుగునప్పుడు పిల్లలతో మాటలాడుచుండ నుపాధ్యాయుఁడు వారిని దండించి నిలువఁబెట్టి ప్రశ్నలడిగెను. ఆప్రశ్నల కన్నిటికిని ముందువెనుకలుతెలుసుకొనక సరియైనసమాధాన మిచ్చెను. పెక్కువిషయముల నొక్కసారి గ్రహించుశక్తిగలవాఁడు. మొదటఁ బరభాషయగు నాంగ్లమును జదువుట కిష్టములేక పోయెను. కాని పితరుల నిర్బంధముచేఁ జదివి యొప్పుకొనెను.

పాఠశాలలో నొకయుపాధ్యాయుఁడు చీటికిమాటికి బాలురను గొట్టువాఁడు. ఒకనాఁ డొకమందుఁడగు బాలుని శిక్షించుచుండ బాలురందఱును గొల్లున నవ్విరి. నరేంద్రుఁడును నవ్వెను. అందువలన నుపాధ్యాయునకు కోపమువచ్చి నవ్వనని చెప్పుమని నరేంద్రుని కొట్టఁబోయెను. ఎంతకొట్టినను నరేంద్రుఁడు బదులుచెప్పలేదు. అంత చెవిపట్టుకొని గుంజపై కెత్తెను. చెవి నుండి రక్తముకారుచుండెను. ఆసమయమున ఈశ్వరచంద్ర విద్యాసాగరుఁడే తనిఖీకై వచ్చియుండెను. అదిచూచి యుపాధ్యాయుని మందలించెను. ఎటువంటిదానినైనను దనకు న్యాయమని తోఁచినదానిని వదలువాఁడు గాఁడు.

బాలురందఱను గూర్చుండఁబెట్టుకొని సన్యాసులు చేయుకార్యములను, వారిదేశాటనములను గూర్చి చెప్పును.

సాముద్రికశాస్త్రజ్ఞుఁ డొకఁడు తాను సన్యాసియగునని చెప్పెనని బాలురచేతులను జూచి వారి కీవిధముగఁ జేయుఁడని జ్యోతిషమును చెప్పుచుండును. ఉత్తములగు మహాత్ములు హిమాలయమున సంచరించుచు, నీశ్వరుని ధ్యానించుచు నిర్వికారముతోఁ గాలము గడుపుచుందు రని నరేంద్రుఁడు పలుకుచుండును.

నరేంద్రుఁడు బాల్యమునుండియు మూఢవిశ్వాసములను నమ్మువాఁడుగాఁడు. బూచి యనినను, దయ్యమనినను దానిని జోపుచుండును. ప్రత్యక్షమునే నమ్మునుగాని గ్రంథములందలి యప్రమాణములను గ్రహింపఁడు. విశ్వనాథుఁడు మధ్యపరగణాలలోనున్నప్పు డతనియింటి కనేకులు పండితులు వచ్చుచుండెడివారు. వారు చెప్పెడివిషయములను గమనించుచు నరేంద్రుఁ డందుదోషము లున్న వారితో వాదించుచు గ్రంథస్థములగు పెక్కులు ప్రమాణవాక్యములను జెప్పెడివాఁడు. వచ్చిన వృద్ధపండితులు నరేంద్రుని ప్రతిభను మెచ్చుకొని యాదర్శపురుషుఁడ వగుదువని యాశీర్వదించిపోయెడివారు.

నరేంద్రు డొకనాడు తీర్థయాత్ర కేగి శివవిగ్రహములం గొని మిత్రునితో వచ్చుచుండఁ జీకటిపడెను. అప్పు డొకబండి క్రింద మిత్రుఁడుపడ సిద్ధముగనుండ నది గమనించి యాపదను తొలగించెను. పదిసంవత్సరముల ప్రాయమున మిత్రుల గొందఱితో నౌకాప్రయాణముచేసెను, మధ్య నొక మిత్రుఁ డస్వస్థతచే నావయందు మలవిసర్జనముచేసెను. అంతట నావికులు శుద్ధముచేయుమనిరి కాని బాలురు ధన మొసగెదముగాని యది మావల్ల గాదని నిరాకరించిరి. అట్లయిన మిమ్ము నొడ్డుచేర్పమని నావికులు మఱొక మార్గమునకుఁ దీసికొనిపోవుచుండిరి. అదిగని

నరేంద్రుఁడు నావదూకి యొద్దనుచేరి యాదారినిపోవుచున్న సిపాయిలకు తెల్పెను. వారు నాటకులను బెదరింప వారు కొత్వాల నొద్దకుఁ జేర్చిరి. మిత్రులందఱు నరేంద్రునిసాహసమును పొగడిరి. ఇతనికి పదునాలుగేండ్లయీడున నొకనాటకమును గ్రామస్థు లందఱుగలసి చూచుచుండిరి. అప్పు డొకనటునకువారంటు నొకఁడు తెచ్చెను. అప్పుడు నరేంద్రుఁడు జనమధ్యమునుండి నాటకమునకు విఘ్నముగలుగక పొమ్ము ఇది సమయముగాదని యఱువ నందఱు నేకగ్రీవముగఁ గేకలిడిరి. అతఁడు తొలఁగి పోయెను. స్వాతంత్ర్యము పరిపుష్టమైన తల్లిరూపవేశమును చాటించెను. ఒకయాంగ్లేయునొకను చూడవలయునని తలంపు గలిగి మిత్రులనుమతిపత్రమును దెచ్చుని నరేంద్రుని కోరిరి. నరేంద్రుఁడు స్థానోద్యోగిని జూడ నేగ ద్వారపాలకుఁడు నిరాకరించె. అంతట నరేంద్రుఁడు ద్వారపాలకుని కను మొఱఁగి మఱొకదారిని లోనికేగి యుద్యోగిని దర్శించి యనుమతిపత్రమును గొని లోపలినుండి వెలికి వచ్చెను. ద్వారపాలకుఁ డెట్లులోనికి బోయితి వని యడుగ నాకు నింద్రజాల విద్య తెలియునని చెప్పి యతని పరిహసించివచ్చెను. నరేంద్రుని బుద్ధి యెంత యధికముగనుండెనో శరీరబలమును నంతయధికము గలవాఁడు. అతఁడు ప్రత్యేకముగ వ్యాయామసంఘమును స్థాపించి యితరులకు నేర్పుచు, తాను మఱియు కత్తిసాము, మొదలగునవి నేర్చుకొనుచుండువాఁడు. వ్యాయామప్రదర్శన ముందు రజతపతకమును బహుమానమునొందినాఁడు. నరేంద్రుఁడు తనవాక్చాతుర్యము మెఱయ నెట్లు చిత్రవిచిత్రతరముగఁ గథలుచెప్పుచుండునో, యట్లే వంటయుండును

వివిధములగుపిండివంటలనుచేసి బాలురకుఁబెట్టి వారిభాగత్తను బొంది యానందించుచుండువాఁడు. 1879-వ సంవత్సరమున మొదలఁ గలకత్తానువచ్చి పాఠశాలలోఁ బ్రవేశించి మూఁడు సంవత్సరములు చదువవలసినవిద్య నొక్కయేఁడాదిలోఁ జదివి ప్రవేశపరీక్షయం దుత్తముఁడుగ నుత్తీర్ణుఁడై తండ్రి విశ్వనాథుని వలన గడియారమును బహుమానముగా నొందెను. నరేంద్రుని గాత్రము శ్రావ్యతరమైనది. కాన దానికిఁ దగిన సంగీతవిద్యను ప్రత్యేకముగ నుపాధ్యాయునిచే నింటివద్దనభ్యాసముచేసెను. ఫిడేలు, హార్మోనియమును వాయించుచు గొంతెత్తిపాడినచో శ్రోతలు పరవశులై వినుచుందురు.

నరేంద్రుఁ డాటపాటలతోను, వినోదములతోనుగాలము గడుపుచు ప్రవేశపరీక్షయం దుత్తీర్ణుఁడై కళాశాలయందుఁ బ్రవేశించెను. పాఠ్యగ్రంథములనేగాక యనేకములగు ప్రమాణగ్రంథములను, పాశ్చాత్యదేశచరిత్రలను, పాశ్చాత్యతర్కశాస్త్రము, తత్వశాస్త్రములను జదివి ప్రావీణ్యము గడించెను. కళాశాలయందలి చర్చాసంఘములయందు తనవాగ్ధోరణిని వెల్లిసి యాసంఘమున కొకనూతనవికాసమును దెచ్చెను. కళాశాలయందు జరుగు నేయుత్సవమునందైనను నరేంద్రుఁడు చక్కఁగ మాటలాడుచు నుపాధ్యాయుల మెప్పువడయుచుండును. ఒక యుపాధ్యాయుని వీడ్కోలుసందర్భమున నతని గుణగణాదులను ప్రసంగింప నాసభ కధ్యక్షతవహించిన మహావక్తయగు సురేంద్రనాథబెనర్జి నరేంద్రుని వక్తృత్వధోరణికి మెచ్చుకొని పొగడి భారతదేశమున నిన్నుమించినవక్తలు లేరని పలికెను. ఏగ్రంథమునైనను సాంతముగాఁ జదువకయే యందలివిషయ

మును గ్రహించుశక్తిగలవాఁడు. తాను చదువునట్టిగ్రంథమును మొదట కొంతచదివి తరువాత నక్కడక్కడ జూచి యా విషయము మూహించువాఁడు. కొన్నివిషయములలో (వేదాలలో) మొదట కొంచెము చదివి చివరిపంక్తిచదివియందలివిషయమును తెలిసికొని పొరపాటులేక చెప్పశక్తిగలవాఁడు. కాబట్టియే పెక్కుగ్రంథములను కొద్దికాలములోఁ జదువఁగలిగెను. ఒకప్పుడు విద్యావేత్తయు, తత్వశాస్త్రనిపుణుఁడును, కళాశాలాప్రధానోపాధ్యాయుఁడునగు 'హేస్టి' యను నతఁడు నరేంద్రుని తత్వజ్ఞానమునకు వింతపడి పెక్కుదేశములఁ దిరిగితిని గాని నరేంద్రునివంటి ధీశక్తిగలవానిని జర్మనీతత్త్వవేత్తలలో గూడఁ జూడలేదు అని వచించెను. అతఁడే రామకృష్ణుని దివ్యానుభవములను నరేంద్రునకుఁ దెల్పినవాఁడు. నరేంద్రునకు తాను జదివినగ్రంథమునుగాని, విన్న విషయమునుగాని చర్చించుటయందు నిచ్చ యధికము. పరోపకారమును తనవలన గాకున్నను నితరునిచేతనైనఁ జేయింప సామర్థ్యముగలవాఁడు. కాబట్టి యతనికి విద్యాభ్యాసకాలమున గ్రంథపఠనమునకు పరోపకారమునకును కాలము జరిగిపోవుచుండును. పరీక్షకు ముందు కొద్దికాలముమాత్రమే పాఠ్యగ్రంథముల నహోరాత్రము చదువువాఁడు. అతఁ డెల్లప్పుడును చురుకుతనము గలిగి యుత్సాహముతో నుండును. అతనికి విద్యతోడు యౌవనమును సహాయపడెను. ఆజానుబాహువులు విశాలవక్షము నున్నతభుజములు విస్తృతముఖము విశాలనేత్రములు గంభీరభావము, బ్రహ్మతేజస్సుగలనొసలు దృఢకాయమును చూడ.

ములఁ బట్టి యాకర్షించుచుండును. విశేషించి వక్తృత్వము కంఠమాధుర్యమును మఱింత తోడ్పడెను.

పట్టపరీక్ష రేపు జరుగును. నాఁడువేకువ నరేంద్రుఁడు నిద్రనుండి లేచి భగవద్ధ్యానమొనరించెను. గుమ్మమువద్దకువచ్చి నిలచెను. తేటాలున నతనిమనమున నానంద ముద్భవించెను. తవంతట నొకటనుండి పద్యములు బయలుదేరెను. మధురస్వరమునఁ బాడఁజొచ్చెను. దానివిని విద్యార్థులందఱు మేల్కొను నప్పటికిఁ బుస్తకహస్తుఁడై నరేంద్రుఁ డెదుట నిలువఁబడి యుండెను. అతనిగానము విని యానందరసమును గ్రోలిరి. పిదప మఱలఁ బాడ నారంభించెను. బాలుడు పరీక్ష కన్నియు జరిగినవా యని ప్రశ్నింపఁ జరిగినవి యని బదులుచెప్పెను. కాని యొకవిధముగఁ బరధ్యానముగ నుండెను. అదిగని సహాధ్యాయులు కారణము నడుగ "నాకు ప్రాపంచికవిషయముల యందు రోతకలిగిన దనియు, సన్యాసము ప్రియమైనదిగ గాన్పించుచున్న దనియు" నుడివెను. అది విని విద్యార్థులు నివ్వెఱపడి, దక్షిణేశ్వరమున మునుపటిసన్యాసిదర్శన మతనికిట్టి తెచ్చిన దనియు విచారపడిరి. ఆమునుపటియే రామకృష్ణపరమహంస. అతనిఁగూర్చి యనేకములగుస్తోత్రములను వ్రాసి రమణీయముగఁ బాడఁ జొచ్చెను. నరేంద్రుఁడు అహమద్ ఖాఁ, వేణీగుప్త యనుసుప్రసిద్ధగాయకులవద్ద 4, 5-సంవత్సరములు గానాభ్యాసముచేసెను. విద్యార్థులు తరగతిలో నుపాధ్యాయులు రానిసమయమునందు నితనిచేఁ బాడించుచుండురు. ఒక సమయమున నరేంద్రుఁడు పాడుచుండ నుపాధ్యాయుఁడు వచ్చి

యాగానమాధుర్యమునకు ముదమంది కౌగిలించుకొని కొని యాడెను.

నరేంద్రునివక్తృత్వమును, విద్యనుజూచి పలువురు తమ కుమార్తెల నిచ్చెద మనియు నతని కున్నతవిద్యాభ్యాసమునకై లండను కేగ ధనము నిచ్చెదమనియు విశ్వనాథునివద్దకువచ్చిరి. విశ్వనాథుండు ప్రయత్నించియు కుమారునిమనస్సు మార్పలేక పోయెను. నరేంద్రుఁడు బ్రహ్మసమాజమునఁజేరి భగవంతుని లక్షణముల నెఱిఁగెను. భగవంతునిఁ బ్రార్థించినచో సాకారుఁడై భక్తునకు సందర్శన మీయఁగలఁడని నమ్మకమును పొందెను. భగవత్సాక్షాత్కారములేనిజీవితము వ్యర్థ మని యతఁడు తలఁచెను.

నరేంద్రునకు యౌవనమారంభమయినదిమొదలు రాత్రి యందు నిద్రించునప్పుడు సకలైశ్వర్యయుక్తమై కళత్రపుత్రాదులతోఁగూడిన సంసారదృశ్య మొకటియు, సర్వసంగపరిత్యాగమొనర్చి దేశములఁ దిమ్మరుచు లభ్యమైనది భుజించుచు మోహపాశముచే సుఖదుఃఖరహితుఁడై ధ్యానించుచున్న సన్యాసాశ్ర మొక్కటియుఁ, గన్నులయెదుటఁ గన్పట్టుచుండెను. ఈ రెంటిలో నేది గ్రాహ్యమో, యేది యగ్రాహ్యమో యని విచారింపఁదొడఁగెను. చివరకు పూర్వపక్షసిద్ధాంతముల నొనర్చుకొని సన్యాసమే పరిగ్రాహ్య మని నిశ్చయించెను.

భగవత్సాక్షాత్కారముగలుగునని బ్రహ్మసమాజముఁ జేరెను. అచ్చట నరేంద్రునికోరిక నెరవేరలేదు. అది వదలి మహర్షి దేవేంద్రనాథుఁ డుత్తమగురుఁడని వినియును, నొకపరి దర్శించి యుండుటం జేసి యతనికడ కరిగెను. లోపలికేగుసరికి

ధ్యానమునుండి లేచుచుండెను. త్వరలో "స్వామీ! దేవుని దర్శించితిరా" యని నరేంద్రుఁడు ప్రశ్నించెను. దేవేంద్రుఁడు "పుత్రా! నీది యోగదృష్టి" యని హెచ్చరించెను. అంతట నరేంద్రుఁడు నిరాశతో భగవంతుని సందర్శింపలే దని నిశ్చయించి మఱలెను. దేవుని చూపఁజాలనియీ వేదములును, శాస్త్రములును నిష్ప్రయోజనములు. భగవంతుఁ డనువాఁ డున్నచో చూచియే తీరవలెను అనుసంకల్పముతో నెందఱనో మతాచార్యులను దర్శించెను. భగవంతునిచూపగలవాఁడెవ్వఁడు గలఁడు! కడకు రామకృష్ణుని తనమిత్రుఁడగు సురేంద్రనాథు నింటదర్శించియున్నప్పుడు, పరమహంస తన్నుదక్షిణేశ్వరమునకు రమ్మనిచెప్పినమాట స్మృతికిరాగా, నరేంద్రుఁడు రామకృష్ణ పరమహంసను దర్శింప నచటికి వెళ్లెను.

శ్రీరామకృష్ణుఁడు నరేంద్రుని జూడగనే కూర్చుండ నియమించి సంకీర్తనము గావింపుమనెను. నరేంద్రుఁడు కొన్ని కీర్తనలను పాడెను. పిమ్మట చేయిపట్టుకొని నరేంద్రు నేకాంత స్థలమునకుఁ గొంపోయెను. కన్నీరు కార్చుచు రామకృష్ణుఁడు "వత్సా! ఎంతకాలమునకు వచ్చితివి! ఇంత నిర్దాక్షిణ్య మెందులకుఁ గల్గె! నీకొఱకు చాలకాలము వేచియుంటిని. లౌకికులగు నీచభాషణములను విని రోసితిని. నాయాత్మానుభవమును ప్రసంగింప నర్హునికై నిరీక్షించుచుంటిని. ఇఁక నీతో ముచ్చటలాడి నాయావేదనను మాన్పుకొందును." అని నరేంద్రుని కింపుగ మాటలాడెను. నరేంద్రుఁడు నెమ్మదిపడెను. మఱునాఁడు నరేంద్రుని, "స్వామీ! నీవు నరుల నుద్ధరించునట్టి నరనారాయణుఁడవని నాకు తెలియును." అని పలుకరించి

మధురాహారములభుజింపఁబెట్టి మరల శీఘ్రముగ నొంటరిగ రమ్మని నరేంద్రుని సమ్మతింపఁజేసి పంపె. కాని నరేంద్రుఁడు పాడినకీర్తనమును, నరేంద్రుఁడు వచ్చుచున్నాఁడని తనయంత రాత్రివాక్యపుబల్కులను రామకృష్ణునకు నరేంద్రునిపైఁ బ్రేమ గల్గించెను. అతనియెడఁబాటునకోర్వక దుర్భరసంతాపమందుచు వనములకేగి యొకమూలచేరి "నరేంద్రా! నిన్నుఁజూడక మనలేను. రమ్ము" అని విలపించును. నరేంద్రునిముఖమునందలి బ్రహ్మతేజమును జూచి భక్తులతో నానందముగఁ జెప్పుచుండును.

నరేంద్రుఁ డెట్టియుద్దేశముచే పరమహంసకడ కరిగెనో, యది సిద్ధింపలేదు. పైగా రామకృష్ణుఁడు తాను పాడినప్పుడు పారవశ్యమున మైమఱచుటయు, బ్రహ్మానందపారవశ్యము, పరకీయములకుసంభాషణములు సలుపుటయు, తాను భగవంతుని చూచితిరా యని ప్రశ్నించినప్పుడు, "ఔను, నిన్ను చూచుచున్నట్లే భగవంతునిఁ జూచుచున్నాను. నీకంటె స్పష్టముగఁ జూచుచున్నాను. నీతో మాట్లాడినట్లే భగవంతునితో మాట్లాడుచున్నాను. భగవంతునికై పరితాపముగలిగినచో నెల్లరును జూడవచ్చును." అని పలికినపలుకులను దలంచుచు "నితఁడు నిజముగఁ గనుగొనెను. ఇతని సంభాషణములును, చేష్టలును జూడ పిచ్చివానివలెఁ గాన్పించుచున్నాఁడు". అని తలఁచి యతని గురువుగ భావింపక నిత్యకృత్యములతో గాలముగడపెను.

ఇట్లు కొన్నిరోజులు గడువ నొకనాఁడు రామకృష్ణుని కడకు మరల నేగెను. రామకృష్ణుఁడు వీరేశ్వరునిఁ దనశయ్యపైఁ గూర్చుండఁబెట్టుకొనెను. రెప్పవాల్పక నరేంద్రుని దర్శించెను. లోలోపల నేదియో గొణుగుకొనెను. నరేంద్రుఁ డది చూచి

మునుపటివలె నేవిద్యోచేయునని యనుకొనుచుండెను. ఒక
కాలములో రామకృష్ణుఁడు తనకుడికాలి నతనిపైఁబెట్టెను.
నరేంద్రుఁ డంతటి శరీరబలముగలవాఁడయ్యును నాభార
మును సహింపలేకపోయెను. చూచుచుండఁగనే సకలవస్తువు
లతో నాగృహము తలక్రిందులుగ దిరుగుచున్నట్లును, తనతో
గూడ ప్రపంచమంతయు లీనమయిపోవుచున్నట్లుగను దోఁచెను.
ఇఁక మృత్యువుప్రాప్తించునని భావించుచు "స్వామీ! నాకు పితరు
లున్నారు. రక్షింపుఁడు" అని అస్వాతంత్ర్యమునఁ బలికెను.
అంతట పరమహంస నవ్వుచుఁ దనయాటచేత నరేంద్రుని
హృదయమును నిమురుచు సకాలమున సర్వము సమకూరు నని
పలుకుచు దివ్యదృష్టి నొసగెను. అప్పుడు పరమహంస వీరే
శ్వరుని నతనిపూర్వజన్మవృత్తమునుగూర్చియు, నాతని
యుద్యమమునుగూర్చియు, నాయుఃపరిమాణమునుగూర్చియు
పెక్కులు ప్రశ్నించెను. అన్నిటికి నరేంద్రుఁడు సదుత్తరము
నొసగెను. అంతట రామకృష్ణుఁడు నరేంద్రుఁడు ధ్యానసిద్ధుఁ
డనియు, నాత్మద్రష్ట యనియు, నంతమున యోగముచేఁ దను
వును త్యజింపగలఁడనియుఁ దలఁచెను. పిమ్మట నరేంద్రుఁడు
స్వస్థుఁడై సర్వమును యథారీతిగఁ గన్గొని యతని ప్రతిభావిశేష
మునకు వింతచెంది యతనియనుమతి గొని మరలవచ్చెద నని
చెప్పి వెళ్లిపోయెను.

నరేంద్రునిగుణములు రామకృష్ణునిమనమున నాటు
కొనెను. అతనిజూడనిచో పరిపరివిధముల నొంటరిగ విల
పించును. శిష్యులసమక్షమున నతనిని వర్ణించుచును. కాళికాదేవి
కడకేగి యాతని రక్షింపుమని ప్రార్థించును. ఇట్లుండ నొక

నాఁడు నరేంద్రుఁడు పరమహంసవద్దకు వచ్చెను. అతనిని చూచి రామకృష్ణుఁడు పరవశుఁడయ్యెను. "ఏల ప్రతినిమిషమును నన్నుఁ దలఁచెదరు. అట్లు భావించుచున్నచో జడభరతునిగతి మీకు పట్టును" అని నరేంద్రుఁడు పలికెను. "నారాయణుని, నీయంతరాత్మను ప్రేమించుచున్నా నని నాకు మాత చెప్పినది. అట్లుగానియెడల నిన్నుఁ జూచిన రోతగలుగదా" యని రామకృష్ణుఁడు పలికెను.

రామకృష్ణుఁ డింత తన్ను ప్రేమించినను నతనిని గురువుగ నంగీకరింప నరేంద్రుని కింకను నిశ్చయము కుదుర లేదు. అయినను రామకృష్ణునిదర్శించుటకై పలుసారులు పోవుచుండెను. "కేశవచంద్రసేనుఁడును, విజయకృష్ణగోస్వామియు నొక్కొక్క జ్ఞానముచేతనే గొప్పవారుకాఁగా, సకలజ్ఞానపరిపూర్ణుఁడ వగు నీవు సర్వలోకప్రసిద్ధుఁడవై వెలుగొందుదు" వన్న పరమహంస వాక్యము నంగీకరింప లేదు. బ్రాహ్మసమాజమునఁ జేరినవాఁ డయ్యెను. విగ్రహారాధకులను వివేకశూన్యు లని నిందించెను. కాళీసమారాధకుఁడగు రామకృష్ణునే యొకసారి విగ్రహారాధన విషయమునఁ జర్చసలిపి విసిగించెను. అంతఁ బరమహంస "విగ్రహారాధనసగుణారాధన యనియు, నిది నిర్గుణబ్రహ్మసాక్షాత్కారమునకుఁ బ్రథమసోపాన మనియుఁ, బ్రతివారును నిర్గుణబ్రహ్మసాక్షాత్కారమును బొందశక్తులు కా రనియుఁ" జెప్పెను. అందులకు నరేంద్రుఁడు, మీ వద్దకువచ్చినంతమాత్రమున మీ కాళీమాత సిద్ధాంతము నంగీకరింపవలయునా, యని నిర్భయముగఁ బలికెను. "త్వరపడకుము నరేంద్రా! జగన్మాతను స్మరించి పరితపించుదినములు రాగల" వని చెప్పెను.

ఒకసారి నరేంద్రుఁ డద్వైతవాదము నిరసించి "కనుపించుచున్న యీపాత్రయు నీ యాసనమును, నీవును నేనును బ్రహ్మనేయంతయు బ్రహ్మయేనా!" యని పరిహసించుచుండెను. అప్పుడు రామకృష్ణుఁడు "వత్సా! ఏమనుచున్నావు" అని పలుకుచు నాతని దాకి సమాధినిష్ఠుఁడయ్యెను. వెంటనే నరేంద్రునికి ప్రపంచమందంతటను బ్రహ్మముతప్ప మఱేదియు గన్పింపలేదు. భోజ్యము భోజనపాత్రయు భోజనము పెట్టు తల్లియు, భుజించుతానును సమస్తము బ్రహ్మమయమై గోచరించెను సర్వము స్వప్నదృశ్యముగఁ గాన్పించెను. కొంత కాలము గడచినపిమ్మట నరేంద్రుఁడు ద్వైతమును సహించెను. అద్వైతతత్త్వము నరేంద్రునకుఁ బ్రత్యక్షమయ్యెను. రామకృష్ణునియందు భక్తి యధికమాయెను. కాని యింక కొన్ని పరీక్షలుచేసినఁగాని గురువుగ నంగీకరింపరాదని నిశ్చయించి రామకృష్ణుఁ డింటలేనిసమయమున నతనిశయ్యక్రింద నొక రూప్యమును బెట్టి యేమియుఁగనట్లు నరేంద్రుఁడు కూర్చుండెను. రామకృష్ణుఁడువచ్చి శయ్యపైఁ గూర్చుండెను. దేహము మంట లెత్తెను; ప్రకంపించెను. తటాలున మంచమునుండి లేచెను. శిష్యుఁ డొకఁడు నేదేని పురుగున్నదేమో యని పడకనంతయు వెదికెను. అందుండి యొకవెండినాణెము పడెను. ఇదంతయుఁ జూచుచు నరేంద్రుఁ డూరకుండెను. ఇది యిచ్చటి కెట్లువచ్చెనని రామకృష్ణుఁడు పలుకుచుండగనే నరేంద్రుఁడు వెలుపలికి వెళ్లెను. ఒకనాఁడు పరమహంస పూజకై పుష్పములను గ్రహించి పోవునపుడు సమాధినిమగ్నుఁడయ్యెను. తనచేతనున్న పూజాద్రవ్యములు క్రిందపడిపోయెను. మఱొక్కసారి

సమాధినొంది యాపుష్పములను దానేధరించెను. నరేంద్రుఁడు అతనిజితేంద్రియత్వమును, తృష్ణారహితత్వమును ప్రత్యక్షముగఁ గనుఁగొని విస్మయుఁడయ్యెను. అంత నతనిగురుదేవుని గాఁ బరిగ్రహించెను.

రామకృష్ణపరమహంస శిష్యుఁడైన నరేంద్రుని దేహమును బరిశోధించి, "వత్సా! నీశరీరలక్షణములు బాగుగ నున్నవి కాని, నీవు నిద్రించునప్పుడు నీశ్వాసము కొంచెము భారముగా నుండును. అది దీర్ఘాయుర్దాయమునకు లక్షణము గా దని విజ్ఞులందురు. నీవు శుష్కవేదాంతివి గావు. నీకన్నులు చూడ దృఢభక్తియు, గోప్యజ్ఞానమును గలిగినవాఁడ వని తెలుపుచున్నవి." యని వచించెను.

నరేంద్రుఁడు ధ్యాననిమగ్నుఁడై గురువు తన్ను ప్రశ్నించుచున్నను, నొకవ్యాధి ముఖమునైన పీడించుచున్నను, రామకృష్ణునందలి గాఢానురాగముచే దక్షిణేశ్వరమునకుఁ బోవుచునే యుండెను. శ్రమ మక్కఱలేకయే సర్వశక్తుల నొసగెద నని చెప్పిన గురువర్యునితో భగవత్సాక్షాత్కారము గాని, యింకేది నాకు మొదట నక్కఱలేదని మొగమాటములేక వచించెను. ఇట్లువచించినను భగవత్సాక్షాత్కారముబొందిన గురుశిష్యులయన్యోన్యప్రేమము వర్ణింప నలవిగాదు.

నరేంద్రుఁడు మూఁడేండ్లవిధానమున విశ్వవిద్యాలయమున విద్యనభ్యసించినను పురాతనవిద్యాభిధానము వదలలేదు. బాల్యమునఁ బఠించిన రామాయణభారతములవలనను, వ్యాకరణములవలనను జక్కగ సంస్కృతమున గవిత్వముచెప్ప నేర్చెను. మాతృభాషను రచించినగ్రంథములు నవీనవంగవాఙ్మయమున



ను_త్తమస్థానము నలంకరించినవి. సహజమగు నతనిపారమార్థిక ప్రవృత్తి పితరు లొసగినశిక్షణచేతను, సద్విద్యచేతను, శ్రీరామ కృష్ణునిసాన్నిధ్యముచేతను ప్రతిభాన్వితమై రాణింపఁ జొచ్చెను. నరేంద్రుఁడు కళాశాలలోఁ దత్వశాస్త్రము నధి కాభివిద్యగా గొని పాశ్చాత్యతత్త్వముల విమర్శనాబుద్ధితోఁ బరికించి, సనాతనమగు వేదాంతగ్రంథముల నాధునికదృష్టితో సమన్వయము చేసికొనుచుఁ దారతమ్యముల గమనించెను. ఇంతియగాక దేశచరిత్రలను సమగ్రముగఁ జదివి మహా పురుషుల యాశయములను, నేయేకాలముల మానవసంఘము ఏట్టిపరిణామము చెందినది యనియును గమనించెను. రోమక సామ్రాజ్యచరిత్రను ప్రత్యేకముగఁ బఠించెను. ఆత్మవిశ్వాసమే నెపోలియనును వీరునిగాఁ జేసినదని నిశ్చయించెను.

నరేంద్రునియాకృతి తేజోవంతమై సర్వజనాకర్షకమై యుండును. గంభీరముగ నడచునప్పు డతనియవయవములనుండి నూతనవిలాసము స్ఫోరకమగుచుండును. మహోన్నతాశయమున నొకప్పుడు తీవ్రముగను, నొకప్పుడు మంద్రముగను నడచును. అప్పు డతనిమూర్తి నేత్రానందకరమై యుండును. పొడుగును పొట్టియునుగాక యతడు సామాన్యముగ నుండును. శరీర దార్ఢ్యముగలవాఁడు. విశాలమగువక్షస్థలమును, నున్నతమగు భుజములును, విశాలఫాలమును నతనివిస్తృతోన్నతభావము లను బ్రకటించును. విశాలములగుకనుఁదామరలు నవనవోన్మీ లనములై నూతనకాంతులు గొల్పుచు నంతరాత్మాలోకనము లని తోఁచును. సంభాషణములు మృదుమధురములై శ్రోత్ర

చేయుచుంటై యుండును. ఆవిధమే రామకృష్ణునికి నరేంద్రుని యందుఁ బ్రేమగల్గించినవి.

పిమ్మట నరేంద్రుఁడు గురు సమ్మతిఁగొని యింటికేగెను 1884-వ సంవత్సరమున పట్టపరీక్షకు (B. A) పోయెను. పరీక్షా ఫలితము యింకను తెలియలేదు. బారానగరమున మిత్రునింట వినోదముగఁ గానముగఁ జేయుచుండఁ దనతండ్రి విశ్వనాథుఁడు మరణించినట్లు వార్తవచ్చెను. వెంటనే యింటికివెళ్లి దహనము నకు సంసిద్ధముచేసిన పితృశవమును జూచి దుఃఖించి దహన సంస్కార మొనర్చెను. ముందెన్నఁడెఱిఁగని కష్టాని దేహ మునకు సహించుటయే స్వభావ మని తెలిపెను. ఆకుటుంబమునకు నరేంద్రుఁడు జ్యేష్ఠుఁడు. భోగభాగ్యములలోఁ బెరిగిన యాతఁడు నలువురు తోఁబుట్టువులతోడఁ దల్లిని పోషింపవలసి వచ్చెను. విశ్వనాథునితోడనే సకలైశ్వర్యములు నశించెను భోగభాగ్యముల ననుభవించిన బంధువులు శత్రువులైరి. అతఁడు న్యాయశాస్త్రాలలోఁ జదువుచుండెను, నిత్యము నడచియే శాలలకుఁ బోవలయును. కొన్నిరోజులు నిరాహారుఁడై పోవలసివచ్చును. మిత్రులు భోజనమునకు రమ్మనిన నింటివద్ద తోఁబుట్టువులను దల్లిని దలఁచుకొని వారి యాహ్వానమును నిరాకరించును. ఇంటికివచ్చి యందఱు భుజింపఁగా మిగిలినది భుజించును. లేనిచో మిత్రునింట భుజించితి నని చెప్పెను. ఇట్లుండ నొక నాఁడు తల్లి భువనేశ్వరి. "మూర్ఖుఁడా! నీ ప్రార్థనలు చాలింపుము. బాల్యమునుండియు భగవంతుఁడని వాపోవుచున్నాఁడవు. అట్టి భగవంతుఁడు యున్నచో నీవు చేసినదే లేదియో చెప్పుము" అని దూషించెను. నరేంద్రుని మనసు సంశయముఁ జెందెను. దేవుఁ

దున్నాఁడా! ఉన్నచో నిట్టిదారిద్ర్యము నైశ్వర్యము నను భాగమెట్లేల! దేవుఁడు లేఁడు. నిజము నిజము." అని తలఁచి దానిలోకమున చాటింపఁదలఁచెను.

అట్టియెడ యోగ(జ్ఞాన) చక్షుఁడగు రామకృష్ణుఁడు శిష్యుని సమీపించి, "పరీక్షితి శ్రేష్ఠుఁడా! నాస్తికుఁడ వయ్యెదవా! శిష్యులుకులు ప్రేలనము, చేసి నాకుఁ జెప్పినది. ఇఁక నిట్లు మాటలాడిన నేను నీమొగముఁజూడను" అని పలికి దక్షిణేశ్వరమున కేగెను. ఆమాటల విని నరేంద్రుఁడు వ్యాకులుఁడై గురువుకడ కేగెను. గురువు సమాధినిష్ఠుఁడయ్యెను. వీరేశ్వరుఁడు పరమహంసను స్పృశించి దుఃఖించెను. నరేంద్రా. నీవు మాతృసంకల్పమును నెరవేర్ప జనించితివని నేనెఱుఁగుదును. సంసారము నీకు నచ్చదు అయినప్పటికిని నేను శపించి యున్నచో నీవు గృహమున నుండు"మని గురువు బోధించెను. శాంతుఁడై నరేంద్రుఁ డింటికి వచ్చెను. వారసత్వము దావా యొకటివచ్చెను. దానిని జయించెను. సంసారభారము దుర్భరముకాఁగా సురేంద్రనాథుని హైకోర్టులో సహాధ్యాయుఁడుగఁ జేరెను. కాని యది యీ సంసారమునకుఁ జాలదాయె. అట్టితఱి నొకయువతి నన్ను పరిగ్రహించుచో నీకుటుంబమునంతయు భరించెద నని పలికెను. మఱియొకతరుణి నన్ను పరిణయమాడిన నాసొత్తంతయు నీకిత్తు నని యాశ గొల్పె. కాని నరేంద్రుఁడు తుచ్ఛసంసారసుఖముల నాశింపక నిరాకరించె. అత్తఱి భువనేశ్వరియుఁ బుత్రుని దూలనాడె.

వీరేశ్వరుఁ డేమియుఁ దోఁచక 'యీదారిద్ర్యమును దీర్పువాఁడు శ్రీరామకృష్ణ పరమహంస గురూజీతప్ప మఱి

యొకనివల్లగా దని, గురువువద్దకు వెళ్లెను. సంసారపుస్థితులను చెప్పి వాపోయెను. ఈదారిద్ర్యము పరిహరింప నీకు శక్తి గలదు. కనుక నాకు తృప్తి కూర్చుడని ప్రార్థించెను. "అబ్బాయీ! నే నటువంటి ప్రార్థనలను జేయను. అదిగో లోకమాత. ఆమెను కోరి నీయిష్టమును బొందు" మని గురు డాదేశించె. నరేంద్రుడు దేవిని సమీపించి జ్ఞానవైరాగ్యభక్తుల నొసగు మని ప్రార్థించె. గురువు "శిష్యా! యేల నీయిష్టమును గోరలేదు.. మరల ప్రార్థింపు" మని చెప్పె. రెండుమూడు సారులువెళ్లియు జ్ఞానవైరాగ్యములకై ప్రార్థించెనేగాని, సంపదను గోరలేదు. పిమ్మట నరేంద్రుడు గురుపాదములపైఁ బడి "స్వామీ! యికంతయు మీమహిమ. దేవిని సంసార బాధానివర్తకమును గోరలేను. నీకుఁ దప్పదు. నాకు దారిద్ర్యమును మీరు తొలఁగింపక తప్ప"దని ప్రార్థించె. అంతట పరమహంస కరుణించి, అట్లే మీకుటుంబమునకెన్నఁ నన్నవస్త్రములకు లోపముగలుగదు పొమ్మని యనుగ్రహించెను. అదిమొదలు కొని యాజగన్మాతప్రభావమువలనను, రామకృష్ణునిమహిమ వలనను విగ్రహారాధనయందు విశ్వాసము గలిగెను.

నరేంద్రుఁడు నిత్యమును దక్షిణేశ్వరమునకు వెళ్లి గురుదేవుని దర్శించుచు వారివలన ననేకవిషయములు నేర్చెను. శుష్కవాదములు నిరుపయోగము లని యెఱిఁగెను. తత్త్వదర్శనము జిజ్ఞాసకు పరమావధి యనియు, సాంఘికాచారముల నిరసింపరా దనియు, జాతిభేదములవ్యవస్థ తత్త్వమార్గమునకు లే దనియు, నెఱిఁగెను. తన్ను దూషించువారిని నీచులనలెఁ దలఁపక నారాయణస్వరూపు లని భావింపనేర్చెను. రామకృష్ణుని

సేవవలన వినమ్రత్వము విశుద్ధమానసత్వము విశ్వాతిశయప్రేమ నిర్భరత్వము నలవడెను. నరేంద్రుఁడు శ్రీరామకృష్ణపరమ హంసయొక్క సహవాసమును పొందఁగల్గినది యాఱువత్సరములు మాత్రమే. అప్పుడు శాంతిప్రదములగు బోధనలతో జ్ఞానసంగ్రహణికలతో, దివ్యానుభవములతో నానందముగ గడపి జీవితమున మహోన్నతదశగ భావించెను. విషయవాంఛా ప్రాబల్యమున లౌకికాశయులగు పాశ్చాత్యులజయించి, ఆత్మ సామ్రాజ్యమును సకలదేశముల వ్యాపింపఁజేసి ధర్మసముద్ధారణ మొనర్ప నరేంద్రుడు గురునాజ్ఞచే బద్ధకంకణుఁడయ్యెను. అరిషడ్వర్గములజయించిన తత్త్వజ్ఞానిధియగు రామకృష్ణునియనంతరము నరేంద్రుఁడతనికి వారసుఁడుగ నాయెను.

రామకృష్ణునికిఁ గంఠవ్రణముగలిగినపుడు నరేంద్రుఁడు తక్కినశిష్యబృందమున కధిపతియై యుపచారములు సల్పుచుండె. నరేంద్రుఁడే రామకృష్ణునియనంతర మతనియాశ్రమమును, శిష్యులను విచారించువాఁడు. కనుక నతనివలన ఆత్మసాక్షాత్కారమునకు మార్గములను, శిష్యులయోగ్యతాయోగ్యతలు గమనించువిధమును, ఎటువంటివాని కెట్టి యుపదేశము చేయవలసినదియును, తదనంతరకరణీయములును, నరేంద్రుఁ డప్రమత్తుఁడై గ్రహించెను. రామకృష్ణుని హితునిగను, సన్నిహితునిగను, తత్త్వజ్ఞునిగను, గురువుగను భావించెను. శయ్యాగతుఁడగు గురుని దివ్యానుభూతిని ప్రసాదింపుమని వేడి మూఁడుదినములు ధ్యాననిష్ఠుఁడై మఱలివచ్చెను. పిదప రామకృష్ణుఁడు "నరేంద్రా! దేవి నీకన్నిటినిఁ జూపెఁగదా! ఈదివ్యానుభూతి భద్రముగ నుంచఁబడును. నాకిఁక నాదగ్గఱ

గలదు. నీవు చేయవలసినకార్యములు చాలఁ గలవు. నాకార్యమును నెరవేర్చినపిమ్మట నిది మరల నీకు సిద్ధించును. శరీరమును జాగ్రత్తగఁ జూచుకొనుచుండుము. ఆహారవిషయమునను మిత్రులవిషయమునను వివేచనగలిగియుండుము" మని నరేంద్రుఁడు మెలఁగవలసినక్రమమును దెలిపెను. రామకృష్ణుఁడు సిద్ధిఁబొందుటకుముందుఁ గన్నుగాఱ్చెను. నరేంద్రుఁడు కారణ మడుగ నాసర్వశక్తులను, తపస్సాధితముల నన్నిటిని నీకొసఁగి యాధ్యాత్మరహితుఁడనై ఫకీరు నయితిని. ఈశక్తిచే సర్వమున కార్యములనుజేసి పిదప స్వస్థితి నొందఁగలవని యూనతిచ్చి 16.10.1886-వ తేదీన బ్రహ్మైక్యమునందెను. నరేంద్రుఁడు గురుపూజఁ బ్రేమపాత్రులైన సర్వశక్తుల గ్రహించెను. రామకృష్ణునిమఠమును నడపించుచు నరేంద్రుఁడు కాషాయక మండలువులధరించి వివేకానందుఁడయ్యెను.

వివేకానందుఁడు రామకృష్ణునియస్థులను రాగిపాత్ర యందుంచుకొని తలపైనిడుకొని శిష్యులు వెంటవచ్చుచుండ కాశీనగరమున నస్థులను స్థాపించెను. 1886 మొదలు 1892 వఱకు కాశీనగరముననే యుండెను. 1897 వఱకు ఆలంబజారు (దక్షిణేశ్వరసమీపమున) నుండెను. 1897 లో బేలూరున స్థాపించెను. "నన్ను నీ వెచట నుంచిన నచటనే యుండుదును." అనిన గురువాక్యముల స్మరించుచు దుఃఖించెను. అప్పుడు మత వివాదములకై పెక్కురు మతప్రవక్తలు రాఁగా వారితో చర్చ సాగించుచుఁ దగినసమాధానముల నొసంగి వివేకానందుఁడు పంపుచుండెను. విశేషములగుపర్వదినములందు వివేకానందుఁడు బాలసన్యాసులతో నహోరాత్రముల భజనలు

ధ్యానములు సల్పుచుండును. బాలసన్యాసులందఱు మిత్రా దులు తమ్మని పిలిచినను బాలుడు పోకుండుటచే వివేకానందుని దూషించుచుఁ బోవుచుండిరి. నరేంద్రుఁడే శ్రీరామకృష్ణ మఠము వచ్చుట సుస్థిరముగ నుండుటకు కారణుడు. ఇతనిదివ్య గానబోధామృతమును గ్రోలఁ జెక్కుచెదరు మఠమునఁ జేరిరి. వీరే రామకృష్ణసేవాసంఘము. ఇది వివేకానందుని కృషియే.

శిష్యులందఱును దపశ్చర్యాయోగాలను గడుపుచు, వంతులును విరజాహోమముచేసి సన్యాసదీక్షను గ్రహించిరి. అప్పు డందఱును తమనామధేయములను మార్చుకొనిరి. నరేంద్రుఁడుమాత్ర మనేకనామములతోఁ దన్ను గుర్తింప కుండుటకై మెలఁగుచుండెను. అప్పుడు దేవిని గ్రహించి బృందావనమును జేరిరి నరేంద్రుఁడు సోదరశిష్యులవలన దనకు సంకటముగలుగుచున్నదని తలఁచి అందఱును స్వయంశక్తిచేఁ బ్రచారము సాగింపవలయు నని చెప్పి వారిని నాలుగుమూలల కును బంపెను.

నరేంద్రుఁడు పరివ్రాజకుఁడై తీర్థయాత్రలకు బయలు దేరి విశ్వేశ్వరనివాసమును నిరంతరపుణ్యావాసమునగు కాశీనగ రమున కేగెను. అచ్చటఁ బండితులగు భూదేవముఖోపాధ్యా యులు, త్రిలింగస్వామి, భాస్కరానందస్వామి మున్నగువారిని దర్శించివారివలన విశేషములనెఱిఁగి యాశీర్వాదమును బడసెను. పిమ్మట నయోధ్యాపురమును దర్శించెను. ఆగ్రాలో తాజ్‌మహాలు నందలి విశేషములఁ గనుగొనెను బృందావనమున కేగి యచ్చట శ్రమదీర్చుకొనఁదలఁచి పాకీవానినుండి ధూమమును గ్రహించి సర్వమతసమత్వమును జాటెను. గోవర్ధనగిరికిఁ బ్రదక్షిణ

మొనర్చి యాకలిచే బాధనొందినను యాచింపకపోవుచుండెను. వెంటనే యొకపురుషుఁడువచ్చి యాహారమిచ్చి భుజింప జేసి, యదృశ్యుఁడయ్యెను 'యోగక్షేమం వహామ్యహం' అను భగవంతునివాక్యమును దలఁచుకొనెను. రాధాకుండమున కేగి కౌపీనము నొంటవేసి స్నానముచేయుచుండ కపి యొకటి కౌపీన మపహరించెను. అభిమానపూరితుఁడై యానందుఁడు కొంతదూర మేగుసరికి నొకపురుషుఁడు కాషాయమును, నన్నపానీయముల నిచ్చి యదృశ్యుఁడయ్యెను. హరిద్వారమున కేగుసరికి వివేకా నందుని ప్రసిద్ధి వినియు, నతనిచిత్రాకారమును జూచియు ముగ్ధుఁ డైన స్టేషనుమాస్టరగు శరచ్చంద్రబోసు నరేంద్రుని సాద రించి పూజించెను. ఆధ్యాత్మికమును బోధించెను. అతనితో హృషీకేశమునకుఁబోయి యతనికి తత్త్వమును బోధించి సర్వ సంగపరిత్యాగమొనర్చ సదానందుఁడని యతనికి నామకరణము చేసెను. అప్పటినుండి సోదరశిష్యులలో నొకరి కస్వస్థతగ నుండుటచేమఱలివచ్చి యతనికి స్వస్థతఁగూర్చి వైద్యనాథమున కేగెను. అప్పట నదీతీరమున నొకసొరంగము నిర్మించుకొని సకలశాస్త్రపారీణుఁడగు పావాభాబా యనునాతఁడు యోగ సాధనల నభ్యసించుచుండెను. అతని ఖ్యాతి హఠయోగము నభ్యసింపఁ గోరికగలిగి నరేంద్రుఁ డచటికి వెళ్లెను. కొన్ని దినము లున్నను నతఁ డుపేక్షకుఁడు కాగా విచారముతో మరలుచుండ గురుదేవుఁడు (రామకృష్ణుఁడు) దర్శన మిచ్చెను. అంతటితో నావిచారమును వదలెను. అఖండానందుని యస్వ స్థతను విని కాశీ కేగి యతనికివలయు పరిస్థితులను గల్గించెను మఱల నరేంద్రుఁడు తపముచేయ మొదలిడెను. అప్పుడు

కలకత్తాలో బలరామబోసు మరణమును విని విచారము నందెను. శ్రీరామకృష్ణుని జ్ఞాపకార్థము గంగానదియొడ్డున నాలయము నిర్మింపవలయు నని ప్రమదాదాసునకుఁ జెప్పి కృషి చేయుచుండెను. ఇప్పుడు కలకత్తాసమీపమున రాజిల్లుచున్న రామకృష్ణునియాలయము వివేకానందుని కృషిఫలితమే. వివేకానందస్వామి స్వాస్థ్యసుఖమునకై యాత్రలకు నఖండానందునితో బయలుదేరి మొదట భాగల్పురమునకుఁ బోయెను. అచ్చటినుండి యఖండానందుఁడు తోడ వైద్యనాథమునకుఁ బోయి యటనుండి కాశికి వెళ్లెను. అచట మిత్రుఁడగు ప్రమదాదాసుతో వేదాంతోపన్యాసములచే ప్రపంచము నుఱ్ఱూతలూఁగింపక మఱల నిట నడుగుపెట్ట నని పలికెను. ఒకరి కాశ్రమమునకుఁ బోవుచు నొకమఱ్ఱిచెట్టుక్రిందఁ గూర్చొని ధ్యాన మొనర్చి యండపిండబ్రహ్మాండముల యేకత్వమును దర్శించితి నని గంగాధరునితో (అఖండానందునితో) నుడివెను. అట్టితఱి సోదరి యాత్మహత్య నెఱిఁగెను. సర్వసంగపరిత్యాగి యగుటను స్మరించి దుఃఖమును వదలి ప్రయాగకుఁ బోయి శ్రీనగరమున కేగి, యటనుండి హృషీకేశమును జేరెను. స్వామి యచ్చట నొక్కపర్ణశాల నేర్పఱచుకొని మాధుకర మవలంబించి తపముచేయఁదొడఁగెను. ఆట మార్గమధ్యమున గలిసికొన్న బ్రహ్మానందతురీయానందాది సోదరులఁ గూడి తత్త్వవిచార సద్గోష్ఠీకథనముచే కాలముగడపెను. సోదరులకు మృచ్ఛకటికా శాకుంతలాదులను బోధించి సంస్కృత పాండిత్యమును ప్రకటించెను. మీరటులో నుండఁగా నొకదినము పుస్తకభాండాగారమునుండి సర్జాన్ లబ్బక్ అనుపాశ్చాత్యుఁడు

వ్రాసిన తత్త్వగ్రంథములను దెప్పించుకొని చదివి మఱునాడే యిచ్చి ' వారిసందేహనివృత్తికై యా గ్రంథస్థవిషయముల నెల్లరికి బోధించెను. పాశ్చాత్యులకు దా నార్జించినసుకృతమును లోకమున కొసగుటకై యాత్ర చేయుట యావశ్యకమగునది, వివేకానందుఁ డేకాంతముగ వసింపఁగోరి, 'సోదరశిష్యసంబంధము కృత్రిమము కాన నాకు వలదు' అని సోదరులను బంపి 1891 జనవరినెలలో ఢిల్లీకి వెళ్లెను.

ఢిల్లీలో వివేకానందుఁడు వివిదిషానందుఁడనుపేరఁ గొన్ని రోజులుండెను; తన్నుఁ జేరవచ్చినసోదరులను 'ప్రతిమానవుఁడును తనయనుసారముగ గమ్యమును జేర యత్నింపవలయు' నని చెప్పి పంపి తా నాళ్వారునగరమునకుఁ బ్రయాణమయ్యెను. 1891 ఫిబ్రవరిలో నాళ్వారుస్టేషనులో దిగి రాజవీథి నేగి యొకవంగదేశీయు నింట వసించెను. మౌల్వీసాహేబు మున్నగువా రనేకులటకువచ్చుచుండిరి. స్వామి వారితోఁ బ్రసంగించుచు ఖురానుయొక్క యౌన్నత్యమును జెప్పియు, మహాభక్తులకీర్తనములను బాడియు, శంకరరామానుజచైతన్యాదుల యావిర్భావములను వివరించియు వేదవేదాంతరహస్యములను బోధించి శ్రోతల నానందపఱచుచుండెను. మూడురోజు లన్నపానములు లేక యుపవసించుచున్నను ఒక్కఁడును స్వామి యాహారవిషయమై పలుకరింపలేదు. అత్తఱి నొకపంచముఁడు స్వామీ! నే చండాలుఁడను. స్వాము లాకలిగొనియున్నారు. పరికరములఁ గల్పింతును భుజింపుఁ డని ప్రార్థింప నతనియందు పరమాత్మ గోచరింప నీవుచేసినరొట్టెలను తిందు నని స్వామి చెప్పి భుజించె. రాజు పరిచయమేర్పడినపిమ్మట నాతిథ్యమున

సిద్ధించును." అని యుపదేశించుచుండును. ఆళ్వారునగరమున సనాతనయువకులను స్వామి సంస్కృతము నభ్యసింపఁజేసెను. ఆళ్వారునగరమునుండి జయపురమున కేగెను. అచ్చట వివేకానందస్వామియొక్క పరివ్రాజకఛాయాచిత్రము తీయఁబడెను. అచ్చటఁ గ్రొత్తవిద్యను గ్రహించి, "దృఢసంకల్పమునకు సాధ్యముగాని దేదియులేదు. కొండలను పిండిచేయవచ్చు" నని వచించెను. స్వామి జయపురమునుండి అబుపర్వతమున కేగి యచట నొకగుహాలో కొంతకాలము తపముచేసెను. అచ్చటనుండి మరల ఖేత్రీమహారాజును జేరి, తనబోధనామహిమచే స్వామి యాతని శిష్యునిగాఁజేసికొని పరిచర్యలఁగొనెను. అతనికి స్వదేశాభివృద్ధికై ప్రకృతిశాస్త్రపరిశోధన లావశ్యక మని శాస్త్రవిజ్ఞానములో తత్త్వబోధన మొనర్చెను. మహారాజునకు సంతానముగలుగ వరమొసగెను. సంస్కారణములచేతను, ధార్మికప్రతిష్ఠాపనలచేతను, నుచితవిద్యావిధానములచేతను ప్రజాక్షేమమునుగోరి దేశాభివృద్ధికి దోడ్పడుడనునాశయముతో స్వామి రాజులతో సహవాసముచేయఁదొడగెను. ఖేత్రినగరమునుండి భూజునగరమున కేగి దివానునకు దేశోద్ధరణమును దెలిపెను. పోర్బందరు కేగి వేదముల ననువదించుచున్న దివానునకు సాయపడెను. పూనానగరమున కేగి బాలగంగాధరతిలక్కును గలిసికొని పెక్కువిషయములఁ జర్చించెను. అటనుండి కొల్హాపురరాజులను దర్శించి ధర్మదీక్షను వివరపరచెను. అచ్చటినుండి మైసూరునకు వచ్చెను. అచ్చటి రాజా చామరాజేంద్ర ఒడయరు పండితసభగావింప నందుస్వామి యుపన్యసించి సభాసదులవివశులజేసెను. అతడొసగుబహుమానముల నిరాకరిం

చెను. పాశ్చాత్యదేశముల కేగునప్పుడు వలసినధనము నొసగుదుని చెప్పెను. రాజుకోరికచే స్వామి తనయుపన్యాసములను గొన్నిటిని గ్రామఫోనురికార్డుల కిచ్చెను. అవి యిప్పటికి నచ్చట గలవు. అటనుండి కొచ్చిదేశముల కేగి రాజునకు మతబోధ గావించి, యచ్చటనుండి రామేశ్వరమును, కన్యాకుమారిని దర్శించెను. అచ్చట శిలాతలమున నిలిచి భారతదేశసౌభాగ్యమును గూర్చి మిక్కిలి విచారించి, "భారతదేశము నుద్ధరింప నీ సముద్రమును దాటి పశ్చిమఖండమున కేగి, నాబుద్ధిబలముచే వలసినంతధన మార్జించెదను. పూర్వదేశమునకు వచ్చి భారతీయపురస్కారములకు నిమగ్నుడ నయ్యెదను. కాదేని తత్ప్రయత్నమున ప్రాణముల వదలెదను." అని కన్నీరుగార దేశభక్తుడై జగద్గురుని, శ్రీరామకృష్ణుని ప్రార్థించెను. సనాతనధర్మస్వరూపమగు భారతీయవిజ్ఞానమును పాశ్చాత్యులచే పూజింపఁజేసెద నని వివేకానందుడు శపథము పూనెను. కన్యాకుమారినుండి బయలుదేరి చెన్నపగరమునకు స్వామి వచ్చెను. అది 1892వ సంవత్సరము. స్వామి మద్రాసులో మన్మథనాథభట్టాచార్యునిగృహమున విడిసెను. స్వామిని దర్శింప వేలకొలది పండితులు వచ్చిరి. అనేకులకు భగవన్మతము నుపదేశించిరి. అందులో నాస్తికుడును, క్రైస్తవకళాశాలోపాధ్యాయుడగు శింగారవేలుమొదలియారను నాస్తికత్వముగలిగించి శిష్యునిగఁ జేసికొనెను. పశ్చిమఖండమునకు సనాతనధర్మసందేశమును గొని పోవుటకు స్వామియే యుక్తులని మద్రాసీయులు తలచి, రైలు వందలరూప్యములను ప్రోగుచేసి చికాగోమహాసభ కరుగవలసినదని ప్రార్థింప దేవియాజ్ఞ కాలేదని చెప్పి యాధనమును బీదలకు

వ్యయింపఁజేసెను. అట్టితఱి హైదరాబాదునుండి యాహ్వానము
రాగా స్వామి బయలుదేరెను హైదరాబాదుస్టేషనులో నా
స్థానోద్యోగులును పండితులును మున్నగు ప్రఖ్యాతపురుషులు
వెయ్యురు వచ్చి స్వాగత మొసఁగి స్వామిని గొంపోయిరి. స్వామి
నవాబునకు మతమును, మతప్రచారమును దెలిపెను. పశ్చిమ
ఖండమున మతప్రచారముచేయ ధనమీయ నవా బంగీకరించెను.
అప్పటినుండి మరల మద్రాసునకువచ్చెను. స్వామికొఱకై వేల
కొలఁది ప్రజలు స్వాగతమిచ్చిరి. పశ్చిమఖండప్రయాణమున
కింకను శారదాదేవియొక్కయు, రామకృష్ణగురుదేవుని
యొక్కయు ననుజ్ఞ స్వామికిఁ గలుగలేదు. ఒకనాఁడు గురుదేవు
సముద్రమునఁ బ్రవేశించుచున్నట్లు కాన్పించెను. అనుజ్ఞయైన
దని ప్రయాణమయ్యెను. ఆదేసమయమునఁ బుత్రప్రాప్తినందుటచే
ఖేత్రిరాజు స్వామిని బిలుచుకొనివచ్చుటకై కార్యదర్శిని
పంపెను. స్వామి ఖేత్రినగరమునకేఁగి మహారాజు స్వాగతము
నందెను. స్వామికిఁ బశ్చిమఖండమున వలయుసౌకర్యములు
గూర్చుటకై తనకార్యదర్శినిగూడ పంపెను. స్వామి యట
నుండి జయపురముమీఁదుగా బొంబాయినగరమును జేరెను.
31-5-1893 తేదిన బొంబాయినుండి 'పెనిన్సులా'రనుఓడ
నెక్కెను.

ఓడ చైనాలో హాంగుకాంగులో నాగగా స్వామి
యచటనున్న బౌద్ధమఠములను చూడఁగలచి, యచటి కావలివార
లకు 'ఓమ్' అనుమంత్రము గ్రహమాత్రానివృత్తికై యొసఁగి
మఠములోనివింతలను గనుగొనెను. పిమ్మట జపానుమీఁదుగా
టోకియో, యొకోహామా మున్నగు ప్రధాననగరముల

దర్శించి జపానుపరిశ్రమల గాంచి యానందించి యున్నతిని గుఱించి మద్రాసుశిష్యులకు లేఖ వ్రాసెను. జపానునుండి కొలది దినములకు చికాగోనగరమును చేరెను. అచ్చట నొక పూట కూటియింట బసచేసెను. మఱునా డచటి ప్రపంచవస్తుప్రదర్శనమును జూడ స్వామి వెళ్లెను. అచ్చటి పాశ్చాత్యనాగరికతా దృశ్యములను, నిర్మాణకౌశలమును, సంపద్వైభవమును జూచి నివ్వెఱపడెను. ప్రేక్షకులతో నా ప్రదర్శనశాల నిండియుండెను ఆజనసమ్మర్దమున నొక్కడైనను స్వామికి పరిచితుడు గానుపింపలేదు. రెండుమాసములయినపిదప సెప్టెంబరులోగాని మహాసభ జరుగదు. ఆశీతలమున శరీరరక్షణమునకు దగినయుడుపులు స్వామికి లేవు. ప్రఖ్యాతిసంస్థలచే బంపబడువారు మాత్రమే యాసభకు ప్రతినిధులుగ రాదగిన దనియు, కాలము వ్యతిక్రమించిన దనియు స్వామి వినెను. "ఇంతటిప్రయాసముతో నింతదూరదేశమునకువచ్చుట వ్యర్థమేనా, ధనవ్యయము మధికముగల నీయమెరికాదేశమున వసించుటకు నాకు ధన మెవ్వ డీయగలడు. నిర్ధనుడ నగునే నిప్పు డేమిచేయవలయు"నని మిక్కిలి పరితపించుట దెలుప నెవ్వరికిని తరముగాదు.

మదరాసులోనిమిత్రు డొకడు తనపరిచితుడగు నమెరికావాసికి స్వామినిగూర్చి యుత్తరము వ్రాసెను. అతడు స్వామిని మిక్కిలి యాదరించెను. చికాగోకంటె బోస్టనునగరమున వ్యయము తక్కువయగు నని స్వామి యచటరైలులో ప్రయాణముచేయుచుండెను. బండిలో నొకవృద్ధవనిత స్వామితో మాట్లాడి తనగృహమునకు రమ్మని బోస్టనుసమీపగ్రామమునకు పిలుచుకొని పోయి వసతిగూర్చెను. అనేకులువచ్చి ప్రశ్నిం

చుచుఁ బోవుచుండిరి. అమెరికాలో చాలకష్టములు సంప్రాప్తమయ్యెను. తనకష్టములనుగూర్చి పరిపరివిధముల వాపోవుచు స్వామి మిత్రులకు జాబులు వ్రాసెను. మహాసభలో ప్రసంగించుట కవకాశము లభింపదే చింతిల్లుచుండ హార్వర్డువిశ్వవిద్యాలయ పండితుఁడగు రైట్ దొర పరిచితుఁడై సభ కభ్యర్థుల నెన్నుకొనుతనమిత్రునకు స్వామినిగూర్చి మన మహాపండితులకంటెను వేయిరెట్లధికుడని వ్రాసి, యభ్యర్థిత్వమును గలిగించెను. స్వామి రైటుపండితునిసాయమున చికాగోమహాసభకుఁ బోవుచు నైవపథమున దారితప్పెను. నాటిరాత్రి రైలుపెట్టెలో సామానులతోఁ గూడఁ బరుండి నిద్రించెను. మఱునాడుదయమున లేచి యమెరికాదేశపుధనికులను స్వామి క్షుద్బాధతో యాచించెను. కాషాయధారియగు నాతని గొందఱు విదలించివేసిరి, మఱికొందఱు దూషించి తలుపులు బిగించుకొనిరి. అది చూచి స్వామి విహ్వలుఁడై యాఁకలిచే నడవలేక భగవంతునిస్మరించుచు నడచుచు నేలపైఁ గూలెను. అప్పుడెదురుగనున్నయింటిలోని యువతి జార్జిహేల్ అనునామె స్వామి క్రిందపడుటను జూచి పరువెత్తుకొనివచ్చి యుపచరింప సేవకుల నియమించి, స్వామి తెప్పరిల్లినపిమ్మట 'మహాసభ కభ్యర్థులా' యని ప్రశ్నించి; భోజనానంతరమున స్వామిని స్వయముగా మహాసభకుఁ గొనిపోయెను. స్వామిని సభవారు ప్రతినిధిగా నంగీకరించిరి. అంతట భగవంతుని, శారదాదేవిని, గురువును నుద్దేశించి భారత ప్రతిభనుజాటు సమర్థునిగాఁ జేయుఁడని ప్రార్థించెను. పదివేలమంది యుండుట, రోమన్ కాథలిక్ మున్నగుమతప్రవక్తలుగల సభ

యందు స్వామి కొనర్చినయుపన్యాసములను పలువురు పాశ్చాత్యప్రముఖులును, ప్రసిద్ధిజెందినపత్రికలును వేనోళ్ల జాటినవి. 1894.వ సంవత్సరమందు అమెరికాదేశమందు పర్యటనమొనర్చిరి. భారతదేశ పునరుద్ధారణమునకై స్వామి వారిప్రతియుపన్యాసమునకై వచ్చినధనమును బంపవలయు నని తలచి యొక యుపసంస్థలో చేరి యుపన్యసింప దొడగిరి. ఒక్కొక్క యుపన్యాసమునకు రు. 600-లు వచ్చుచున్నను, ఆసంస్థయంతయు నపహరించెను. అది యెఱిఁగి స్వామి యాసంస్థను వదలి యుచితముగ నుపన్యసింపఁదొడఁగిరి. పరదూషణలను గాని, భూషణలగాని యాలకింపక స్వామి మౌనమువహించెను. ఒక్కొకసారి వారమునకు 12 నుండి 14 ఉపన్యాసముల నొసగవలసివచ్చెను. స్వామి కుపన్యాసమునకు ముందు దిన మర్ధరాత్రమున మరునాడు తా నుపన్యసింపఁ దగినవిషయమును నెవ్వరో చెప్పుచున్నట్లు గోచరించును. దానినే సభలో మరునాడు స్వామి యుపన్యసించునట. అట్టిసమయమున స్వామికి స్వప్నమాత్రమున పరులజీవితమును మార్పగలుగునట్టియోగశక్తులు సిద్ధించెను.

ఒకప్పుడు క్రైస్తవమతప్రచారకుల కుపన్యసించుచు రెవరెం డనునతఁడు స్వామి రాజకీయప్రతినిధి యని పలికెను. అప్పుడు స్వామి "రాజ్యతంత్రముతో గాని, రాజకీయాందోళనములతోఁ గాని నాకు కొంచెమైనను సంబంధము లేదు. నాలక్ష్యము పరమార్థ మొక్కటియే. అది సరిగా నున్న నన్నియుఁ దమంత సరిపడును. ఇదివఱకుఁ జేసినప్రసంగములలో నట్టివేమైన గలవా యని పత్రిక లరయునవి." అని నుడివిరి.

అపవాదములకు సమాధానములు చెప్పలేక సిగ్గి, వారలు హిమగిరిప్రాంతవాస మెప్పుడు లభించునో కదా యని తలచు చుండుదురు. భారతీయవిజ్ఞానము పాటిగ్రీన్‌కర్ దేశీయసభలో స్వామి పల్గొనిరి. అటనుండి న్యూయార్కునకువెళ్లి బ్రూక్లిన్ సంఘమున నుపన్యసించిరి. పలువు రమెరికనులు శిష్యులైరి. 1895-వ సంవత్సరము ఫిబ్రవరిలో నచ్చటివారికి విద్యాబోధన గావింప మొదలిడెను. రాజయోగరహస్యముల నతడు బోధింప మొదలిడెను. అట్టితఱి శిష్యులు భారతదేశమునకు నేగిరండని లేఖలపై లేఖలు వ్రాయదొడగిరి. వారికి కొంతకాల మాగుడు; స్వశక్తిపై నిలిచి యుండుటను ప్రపంచమును మేల్కొలుపవలసి యున్న దని సమాధానములు వ్రాసిరి.

పాశ్చాత్యలోకమున ముందడుగువేయుచున్న యాంగ్ల దేశమునకును సనాతనధర్మమును దెలుపవలయు నని స్వామి తలంపుగొనియుండిరి. అప్పుడు మిస్ ముల్లర్, ఇ. టి. స్టర్డి యనువారి యాహ్వానములు స్వామికి జేరెను. వెంటనే స్వామి బయలుదేరి మార్గమధ్యమున నున్న ప్యారిసునగరమునఁ గొన్నిదినములు వసించెను. క్రైస్తవమతవ్యాప్తి తగ్గెను. వారి యాదాయ మాసంవత్సరమున నొకటిన్నరకోటిరూప్యములు తగ్గెను. అందువలన క్రైస్తవమతప్రచారకులు వివేకానందని అణప ప్రయత్నములు సాగించిరి. కాని కొనసాగలేదు. లండను చేరగనే పెక్కురుమిత్రులు ఆయనకు స్వాగతమొసర్చిరి. లేడు యింగ్లకాతిథ్యముగొన రమ్మనిరి. పిమ్మట రాజభవనమున నాత్మజ్ఞానమునగూర్చి వేలకొలదిజనులకుపన్యసించెను. పెక్కురుయువకు

లును యువకులును స్వామికి శిష్యులై హైందవులవలె నేలమీఁదఁ బద్మాసనము వేసికొని కూర్చుండి యుపదేశముల వినుచుండిరి. విశ్రామము లేక మతవ్యాప్తి చేయుటచే స్వాములు మిక్కిలి యలసటఁ జెందిరి. మతోత్కృష్టైవచో మరణించియుండుదు రని స్వామియే మిత్రులకు వ్రాసియున్నారు. అచ్చటనుండి మరల నమెరికాకు ప్రయాణము చేయు నెంచి, యచ్చటిశిష్యులకుఁ దమలోఁ దా నొకసంఘము నేర్పఱచుకొని భగవద్గీతాది గ్రంథపఠనము సాగింపు డని యుద్బోధించి యమెరికాకు బయలుదేఱిరి.

అమెరికాఖండమున నీసారి స్వామి పెక్కుతావుల సంఘముల స్థాపించుచు వేదాంతబోధనము, వేదాంతానుష్ఠానము, సర్వమతసమరసభావమును బోధించి యనుష్ఠింప జేయుచుఁ బర్యటనము సాగించెను. అనేకు లనేకవిధముల పత్రికాముఖమునఁ బ్రశంసించిరి. వివేకానందస్వామి మూర్తిమత్త్వమును, ఆతనియుక్తమును నమెరికాప్రజల నద్భుతముగ స్వవశము గావించికొనెను. ఆతనిహాస్యరసనంభాషణములో శ్రోతలహృదయముల నవీనభావములఁ దనలఁ జేయును. మరల 1896-వ సంవత్సరము ఏప్రిల్ మాసమున న్యూయార్కునుండి లండను వచ్చెను. అచ్చటికి శారదానందుఁడు వచ్చియుండెను. స్వామి యతనిఁజూచి మిక్కిలి యాశ్చర్యము నొందెను. మిస్ ముల్లర్, ఇ. టి. స్టర్డీలు, మాక్సుముల్లర్‌ను దర్శించెను. లండనులో స్వామి యుద్యమము జయప్రదమయ్యెను.

శిష్యులు స్వామి శ్రమజెందియుండుటచే బశ్చిమదేశ పర్యటన మొనర్ప నాహ్వానించిరి. ముల్లరుకవ్వయు, సెవియరు దంపతులతో స్వామి స్వాకీయమీదుగా జెనోవా కేగి బెలూను యాత్ర చేసి, అల్ప్సుపర్వతమందలి మంచుకొండలనెక్కి, స్విట్జర్లాండులోని సౌందర్యమును దిలకించుచు బ్రయాణముసాగించుచుండిరి. జర్మనీలోని వేదవేదపండితుని ఆహ్వానము నంగీకరించి స్వామి కీల్పట్టణమునకు వెళ్లి పండితుని దర్శించెను. అందందు వ్యాప్తిజెందించి తనయుద్యమమును నెలకొల్పెను. ములల లండనుకువచ్చి యందలి యనుమతిగొని, గుడ్విన్, సోదరి నివేదితా (నోబుల్), సెవియరుదంపతులు తన్ను సేవింప నిచ్చగొని రాగా వారి మాతృదేశయాత్ర స్వామి సాగించెను. 11 సంవత్సరములు పశ్చిమఖండసంచార మొనర్చి మోదయొక్క కొలంబోకు 15-1-1897 వచ్చెను. అచ్చటచేరిన వేలకొలదిజనుల స్వాగతము నందికొని మహోపన్యాస మొసగెను. కాండి, జాఫ్నా, పాంబనుపట్టణములను దర్శించుచు నుపన్యసించుచు వచ్చెను. మాతృదేశాగమనజ్ఞాపకార్థము రామనాథరాజాచే జేయింపబడిన 40 అడుగుల యెత్తుగల విజయస్తూపమును 27-1-1897 పాంబనునగరమున స్వామి పాదము లిడినతావున స్థాపింపబడెను. రామనాథపురము, మధుర, తిరుచినాపల్లి, కుంభకోణముల నున్న జనుల గంభీరవాక్కులచే నానందపరచి మద్రాసుకు వచ్చిరి. వారు వచ్చుటయందు ఎగ్మూరుస్టేషను చక్కగ నలంకరించి ప్రవేశించుటకు టిక్కెట్లు పెట్టబడెను. అయినప్పటికిని స్థలమంతయు క్రిక్కిరిసెను. ఉత్సవముతోడ పురవీథులగొని

వచ్చిరి. 9 దినము లచ్చట వసించిరి. మఱల పాశ్చాత్య దేశమునకు రమ్మని స్వామి కాహ్వానములువచ్చెను. పూనాకు రావలసినదని తిలక్ స్వామి ఆశించెను. విశ్రాంతియావశ్యక ముయియుండుటచే స్వామి 15-2-1897 జన్మస్థానమగు కలకత్తాకు నోడలో ప్రయాణముచేసిరి.

వివేకానందునికి స్వాగతమొసంగ దర్భాంగమహారాజు అధ్యక్షతను నొకసంఘ మేర్పడెను. స్వామి ఖిదర్పురమువచ్చినది సంఘ మచటికిఁ జేరి ప్రత్యేకపుర్రైలుబండిలోఁ గలకత్తాకుఁ దీసి కొనివెళ్లెను. అచ్చటఁజేరినప్రజలకు స్వామి నమస్కరించెను. హర్షధ్వనులు మిన్నుముట్టుచుండ నొకయశ్వశకటముపై స్వామిని కుసుమమాలాలంకృతునిజేసి స్వయముగ శకటమును లాగికొనిపోయిరి. స్వామి కొసంగుస్వాగతపత్రములకు పరిమితి లేదు. అట్టిసమయమున రామకృష్ణునిజన్మదినమువచ్చెను. స్వామి యుత్సవమున పాల్గొని ప్రజలు తన్ననుగమింప దక్షిణేశ్వరవన మునకును, కాళీమాతాలయమునకును నేగి యభివందన మొసర్చి ఆంగ్లేయశిష్యసహితుఁడై రామకృష్ణులు వసించిన ప్రదేశమును, తపమొసర్చినస్థలమును, సిద్ధినందినస్థానమును దర్శించి ప్రార్థనలు సలిపెను. స్వామి 9-12-1893 రామకృష్ణమఠ స్థాపమునకై 15 ఎకరములభూమిని నొకభవనమును గొనెను. కాశీలో సేవవనగృహమున బసచేసి, యాలంబజారమఠమున సోదరశిష్యులనుగలిసికొనుచుండెను. "విద్యావంతులు, బ్రహ్మ చారులు నగువారే ఆత్మమోక్షలోకకల్యాణములను గూర్చ గల"రని యువకులకు బోధించుచుండెను.

స్వామి మనశ్శరీరశక్తులను ధారవోసి తీవ్రముగకృషి సల్పుటచే నారోగ్యము చెడెను. వైద్యులసలహాచే డార్జిలింగున కేగిరి. బర్ద్వాను మహారాజు తనభవనమున నొకభాగము స్వామి వసించుట కొసగెను. అప్పుడు స్వామి తనయోగసిద్ధులచే జ్వర పీడితులకును, నపస్మారరోగులకును, స్పర్శమాత్రమున స్వస్థులుగ చేసిరి. స్వామి బోధనలచే ననేకులు సర్వసంగపరిత్యాగులై మఠ మునఁ జేరిరి. రామకృష్ణుని యాశయములను నెరవేర్ప స్వామి సేవాసంఘములనుస్థాపించెను. విదేశములకును భారతదేశమున కును సంబంధము గల్గింప నచటి కేగి యుపన్యాసముల నలుప సుశిక్షితులను నేర్పాటుగావించెను. కలకత్తాలో 18' 9-వ సంవత్సరమున శ్రీరామకృష్ణసేవాసంఘ మనియు, శ్రీరామకృష్ణ మఠ మనియును రెండుభాగములుగ విభజింపఁబడెను. మఠ మునఁ జేరువారలకు మోక్షమునకును, సన్యాసజీవనమునకును వలయు శిక్షణ మొసగుట మఠసంస్థయొక్క యుద్దేశ్యము. వైద్య శాలలు, విద్యాశాలలు, సేవాశ్రమములు మున్నగునవి స్థాపించి మానవసేవ చేయుట సేవాసంఘముయొక్క ముఖ్యోద్దేశ్యము. బ్రహ్మచారులును, సన్యాసులు నైనవారే యీకార్యవర్గసభ్యు లుగ నుండదగుదురు. అని సోదరశిష్యులకు రామకృష్ణునిమహిమ లను, పాశ్చాత్యఖండమందు స్వానుభవములైన గురుమహిమ లను చెప్పి కార్యము నిర్వహింప స్వామి ప్రోత్సహింపజేసెను.

వివేకానందునియారోగ్యము సరిగ లేకుండుటచే వైద్యుల సహాయమున కలకత్తాను వదలి స్వామి హిమాలయమునందలి ఆల్మోరాపట్టణమునకు బయలుదేరిరి మధ్య లక్నోనగర

వాసులు స్వాగతమిచ్చిరి. లోడియానగరమునఁగూడ వేల
కొలదిజనులు స్వామికి స్వాగతమొసగిరి. పౌరులు మేడలపై
నుండి పుష్పములు చల్లుచుండ స్వామి యశ్వారోహణమున
ఆల్మోరాపట్టణమును ప్రవేశించెను. స్వామికిఁ గొంతయా
రోగ్యము చేకూడెను. ఉత్తరదేశాభ్యాసములువచ్చుటచే
స్వామి ఆల్మోరాలో రెండుపన్యాసములొసగి, బయలుదేరి,
బొరిల్లి, అమృతసరమువాటి జమ్మూనగరమున కాశ్మీరమహా
రాజును గలిసికొని, యటనుండి లాహోరుచేరెను. అచ్చట
ఆర్యసమాజికులసంశయములను దీర్చెను. అద్వైతవేదాంతనిధి
యగు రామకృష్ణగోస్వామిని దర్శించెను. తన గానమునకుఁ
బ్రీతుడై బహుమతిగనిచ్చిన బంగారుగడియారమును నీవద్దనుంచె
నేను ధరింతు నని యతనికిచ్చెను. అటనుండి యాళ్వారునగర
మున కేగి పూర్వము తనకు నాతిథ్యమొసగిన వృద్ధవనితకు
స్వామి నూఱురూప్యముల నొసగెను. ఖేత్రినగరమున కేగి
ఖేత్రి మహారాజిచ్చిన మూడువేలరూప్యములను, ప్రజలును
రాజోద్యోగులు నిచ్చినవి శేషధనమును స్వామి మఠమునకుఁ
బంపెను. స్వామి "నేటిభారతీయులు హిందువులుగారు;
వేదాంతులుగారు. నన్నంటకు మని పలుకువారు. వంటయిల్లే
దేవాలయము. వంటకుండలే దేవతలు. ఈపరిస్థితి నశింప
వలయును ఉపనిషదర్థమును గుర్తింపవలయును" నని ఖేత్రి
మహారాజునకుఁ దెలిపెను. పాపభూయిష్ఠములగు వ్యక్తి
చారాదినీచకృత్యము లీదినములలో నెవ్వరును గర్హింపరు.
భోజ్యపానీయాదినిబంధనములతో సంఘపాతిత్యము సుప్రత్ర
వమును గూడి యున్నది." అని కాశ్మీరరాజునకు దెలిపెను.

"వర్ణములలో శాఖాభేదములను బోగొట్టి బాంధవ్యములు జనుపఁగొనవలయును. ప్రథమమున తత్త్వబోధకులకన్న పానీయాదులకార్చి పిదప సామాన్యజనులఁ ఉద్ధరింపవలయును. భారతీయవిజ్ఞానసిద్ధులగు వేదశాస్త్రముల నిలువఁబెట్టిన బ్రాహ్మణులను బంధువులనా దూషింపరాదు, సంస్కృతవిద్యావ్యాప్తి నొందింపవలయును బలవంతులను, ధీమంతులను పెదఁజేయు పట్టి జాతీయవిద్యాశాలల నెలకొల్పవలయును. త్యాగము, సేవ ఇవియే భారతీయుల కాదర్శము లని యెఱుఁగవలయును. ఏకమత్యము పెంపొందవలయును. పాశ్చాత్యులకు సనాతనధర్మతత్వముల బోధించుటయును, వారివారి గ్రామీణవిద్యలను నేర్పుకొనుటయును యువకులకు శిక్షణ నొసంగవలయును." అను నీయుద్దేశములను స్వామి దేశమంతటను వ్యాపింపఁజేసెను. కలకత్తాలో ప్లేగు వ్యాపింప స్వామి తనయారోగ్యమునైనను గణింపక డార్జిలింగునుండివచ్చి జనులకు తోడ్పడెను. నైనిటాలునకు వెళ్లెను, శిష్యులతోఁగూడి ఆల్మోరకు వెళ్లి శివాజీనిగూర్చియు, శుకునిగూర్చియు, బుద్ధభగవానునిగూర్చియు నుపన్యసించెను. అప్పటికే పవహారిబాబాయొక్కయు, పాశ్చాత్యదేశమునఁ దనయుపన్యాసముల సంగ్రహించి (షార్టుహాండుచేసి) ప్రకటించిన గుడ్విన్‌యొక్కమరణమును బహువిధముల స్వామి పరితపించెను. ఆల్మోరాలోనే దేశభక్తుడును, మహావిద్వాంసుడునగు అశ్వినీకుమారదత్తు స్వామిని దర్శించెను. దేశీయవిషయముల నెన్నింటినో వారికి స్వామి తెల్పెను. అటనుండి శిష్యులతో మనోహరములగు పర్వతార

ణ్యములమీదుగాఁ గాశ్మీరమునకుఁ బోయెను. అచ్చట 'తక్త ఇసులేమాన్' దేవాలయమును దర్శించి భారతీయులదేవాలయ నిర్మాణోద్దేశ్యమును ఆంగ్లశిష్యులకు దెల్పి యటనుండి శ్రీనగరమునకుఁ బయనమయిరి. అచ్చట దేశోన్నత్యమునుగూర్చి ప్రసంగించిరి. అటనుండి యమరనాథమున కేగి యచ్చటి స్నానదేవతారాధనలును యథాపూర్వముగ నిర్వర్తించిరి. మొదటి పాశ్చాత్యశిష్యురాలుండుటచే నచ్చట సాధువులు స్వామిని నిరోధించిరి. కాని వారివైరాగ్యనిష్ఠ క్తులను గాంచి దాసులైరి. స్వామి అమరనాథపరమశివుని నమస్కరించి ధ్యాననిమగ్నుడయ్యెను. శివుడు స్వచ్ఛందమరణమును ప్రసాదించెను. అటనుండి స్వామి యొంటరిగ క్షీరభవాని కరిగి యచ్చట దేవిని వారముదినములు క్షీరాదులతో నర్చించి జపహోమాదుల నాచరించెను. మరల శ్రీనగరమునకువచ్చి యచ్చటనుండి తెచ్చిన పూవులను శిష్యులతలపై నిడి యాశీర్వదించెను. అట జ్వరాదికముచేఁ బీడింపఁబడు నొకఫకీరును స్పర్శమాత్రముచే స్వస్థుని జేయు నాఫకీరు స్వామిని గొలుచుచుండెను. ఆఫకీరు గురుద్వేషియై స్వామికి వమనాదులుగలుగ క్షుద్రప్రయోగము చేసెను. అది తెలిసి రామకృష్ణుని స్మరించి స్వామి స్వస్థుడయ్యెను. అటనుండి శిష్యసమేతుఁడై "లాహోరుమీదుగా బేలూరు మఠమున కరుదెంచెను. అచ్చట శ్రీరామకృష్ణునిమఠమునను విశేషముగ స్థాపించుచు శిష్యులకు దేశప్రచారమునకై శిక్షణ నొసగుచుఁ గొంతకాలము గడపిరి.

స్వామి దేవియాజ్ఞగొని నివేదితాతురీయానందులతో గూడి మరల పశ్చిమఖండమునకు 20-6-1899 తేది గోల్కొండ

యమునోడపై పయనమాయెను. మద్రాసునగరవాసు లొసగు పూజలంది యట దినకరమే నాలుగురోజులు ప్రయాణముచేసి కొలంబోకు చేరిరి. మధ్య శిష్యుల కనేకబోధనలు భగవద్ గీతాపారాయణమును గావించుచుండిరి. ఏడెన్, సూయజుల మీదుగా లండనునగరమును 31-6-1832 తేదిని చేరి, యట కొన్ని దినములు స్వామి శాంతముగఁ గడపిరి. అటనుండి యమెరికాకు బయలుదేరి, న్యూయార్కునగరమును ప్రవేశించెను. అట ప్రచారము సాగించుచున్న అభేదానందుఁడును మిత్రులును దర్శించి స్వామికి స్వాగత మొసఁగిరి. అప్పట నాధ్యాత్మికమును దలంచుచు నభేదానందునితోఁ దా నిక రెండు మూఁడుసంవత్సరములకంటె జీవింప ననియు నాయంతరాత్మ యీ దేహము ధరింపఁజాల దనియు స్వామి వాక్రుచ్చెను. న్యూయార్కునుండి స్వామి తత్పరిసరపట్టణములను దాఁచుచుఁ గాలిఫోర్నియా పరగణామందోయి స్వాగతముల నందెను. అటనుండి లాస్ ఏంజలిస్‌న కేగి యచట కొన్ని దినములుండి వేదాంత తత్వము, కర్మరహస్యము, మనశ్శక్తులు మున్నగువిషయముల నుపన్యసించిరి. పసడేనాపట్టణమున కేగి షేక్స్పియరుసంఘము నందును, యూనివర్సిటీచర్చియందును రామాయణము, భారతము, దేవదూత యగుక్రీస్తు, విశ్వమానవమతోపలంబనము, మతప్రబోధకులు అనువిషయములను వేలకొలదిజనులకు స్వామి యుపన్యసించిరి. అచ్చటనుండి ఓక్లాండ్, సాన్‌ఫ్రాన్సిస్కోనగరముల నుపన్యసించిరి. దానివలన వేదాంతసంచలనముకు గలిగెను. మఱియు బుద్ధ, క్రీస్తు, మహమ్మదు, కృష్ణుల సందేశములను, మనస్తత్వమనశ్శక్తులను, ప్రకృతిజీవేశ్వరులను

మున్నగువానినిగురించి ఫ్రెన్సిస్కోపౌరుల కుపన్యసించెను. పెక్కుస్థలముల వేదాంతసంఘములు స్థాపింపబడెను. కాలిఫోర్నియాలో శాంత్యాశ్రమమును స్థాపించి తురీయానందుని ఆశ్రమాధిపతిగ స్వామినియమించిరి. వైద్యులసలహాచే స్వామి కాంప్ టేలరనుచోట పాశ్చాత్యశిష్యులతో సుఖముగ కాలము గడపుచుండెను. అయినను స్వామి తనకిహలోకయాత్ర ముగియవచ్చినదని యొకతెకు 18-4-1900 తేదీన 'మిస్ మెక్లాడ్' అనుశిష్యురాలికి ప్రపంచమునకు తనకు సంబంధము వీడిన దనియును, ముక్తిని గురించియు, కర్మనుగురించియు శరీరస్పృహతొలగిపోవుచున్న దనియును స్వామియుత్తరము వ్రాసెను.

ప్యారిస్పట్టణమున సర్వమతచారిత్రికమహాసభ జరుపుటకై పాశ్చాత్యులు ప్రయత్నించుచుండిరి. అందుపన్యసించుటకై వివేకానందుని కాహ్వానమంపిరి. 20-7-1900 తేది ప్యారిసు నగరమున శిష్యులను లెగెట్ దంపతులగృహమున విడిచెను.

అప్పటి మతప్రచారమువలన క్రైస్తవమతము క్షీణించు ననుతలంపుచే చారిత్రిక విమర్శమాత్రము జరుపబడవలెనని తీర్మానించిరి. అందు స్వామివైదికమునుగూర్చి యుపన్యసించుచు దేశీయగ్రంథములయుత్కృష్టత నుపన్యసించిరి. అందు జగదీశచంద్రబోసుకూడ నుపన్యసించెను. సభ యనంతరము స్వామి బ్రిటానీ యనుపరగణాలో ఓలిబుల్ సతిగృహమున శిష్యులతో నేగెను. భారతబాలికాపాఠశాలాభివృద్ధికై నివేదితాసతి యింగ్లాండున కేగెను. బ్రిటనీనుండి స్వామి మిత్రులతో వియన్నా, కాన్‌స్టాంటినోపిల్, ఏథెన్సు, ఈజిప్టులను దర్శించి, ఒంటరిగ భారతదేశమునకు మరలెను.

వివేకానందస్వామి 9-12-1900 తేది రాత్రి బేలూరు మఠమునకు వచ్చిచేరిరి. అందఱు నసంభావితముగ వచ్చుటకు వింతనొందిరి. భోజనానంతరము స్వామి పశ్చిమదేశపర్యటన మునుగూర్చి సోదరశిష్యులకు తెలియజేసెను. సేవియర్ మరణముచే విచారించుచున్న యతనిసతి నోదార్చుటకై మాయావతి కేగి యచ్చట కొన్నిదినములు వినోదముగ గడపెను. బేలూరుమఠమున సందఱకును బోధనకు వలయు పాఠములును, శరీరదార్ఢ్యమునకు వలయువ్యాయామానుష్ఠతులును, ఆధ్యాత్మికాభివృద్ధికివలసిన ధ్యానాదిసాధనములును నిర్వహింపఁబడుచుండెను. స్వామికి మిగిలినది కార్యభారమును వహింప సమర్థులగువారిని తయారుచేయుటయే. వివేకానందుని మాత భువనేశ్వరీదేవి అప్పును, ప్రాచ్యవంగదేశములలోని పుణ్యక్షేత్రములను దర్శింపఁగోరెను. స్వామి తల్లిని, శిష్యులను గొందఱ వెంట నిడుకొని 18-3-1901 తేదిని కలకత్తానుండి బయలుదేఱి ఢాకా చేరిరి. అచ్చటి వాసు జమీందారుగారి భవనమున కుత్సవముగా గొనిపోయి విడిచిరి. జగన్నాథశాలలోను, మఱునాడు బహిరంగముగను మాతృదేశోద్ధరణ మునుగూర్చి స్వామి యుపన్యసించెను. అటనుండి కామాఖ్య చంద్రనాథపుణ్యక్షేత్రములను దర్శించి గౌహాటి కేగి యచట మూడుపన్యాసములజేసెను. అచ్చట సర్ హెన్రీ, కాటను దొరలతో సంభాషించెను. నాగమహాశయు నింట పతినిగృహిణి యొసగినయాతిథ్యమును గ్రహించెను. అచ్చట వివేకానందుని కారోగ్యము బాగుగ తగ్గిపోయెను. ఉబ్బసము, అతిమూత్రము నధికమయ్యెను. శరీర మేమైనను దిగులులేదు. 15-వందల సంవత్సరము లాదరింపవలసినకృత్యముల దేశమునకు బ్రక

టించితి నని స్వామి నుడివెను. కొన్నినెలలు గడచెను. మరల బేలూరుమఠమున కరుదెంచెను. ఉపచారములు చక్కఁగ సాగుచుండెను. స్వామి యనేకవిధములఁగ మఠమునందంతటను సంచరించుచుండెను. ఇప్పుడు కాళ్లుబ్బెను. నడచుటకు శక్తి లేదు. నిద్రపట్టదు. మఠమునకు పైయంతస్తున ఆగ్నేయభాగమున నున్నగది స్వామి నివాసస్థానము. అది విశాలమై నాలుగు కిటికీలు మూడువాకిండ్లచే నొప్పుచుండును. అదియే పఠన మందిరము. అందు నొకవైపు నైదడుగుల నిలువుటద్దము, కాషాయము లుంచుకొనుచట్టము, స్ప్రింగులుగలయినుప మంచము, పూలపాత్ర, యొకబల్లపై వ్రాయుపరికరములు, నొకగంటయు, మఱియొకబల్లపై పింగాణిపాత్రలు, ధ్యానమున కుపయోగించుకృష్ణాజినము, రామకృష్ణునిపటము గలిగి యొప్పారుచుండును. స్వామి భక్తులతో ముచ్చటించి, భుజించి నిద్రించెను. యోగస్థితుఁడై పరమేశ్వరధ్యాన మొనర్చెను. స్వామి యనారోగ్యమున నుండెను. భువనేశ్వరి, బాల్యమం దొకప్పుడు నరేంద్రునికి జబ్బుచేయగా గాళికాదేవియెదుట పొరలించెద నని మ్రొక్కుకొనెను. అది స్మరణకువచ్చి నరేంద్రునకు కబురంపెను. వివేకానందుఁ డస్వస్థతగ నుండియు, మాతృవాంఛదీర్ప గంగాస్నానమొనర్చి యార్ద్రవస్త్రములతో దక్షి మ్రొక్కును నెరవేర్చెను. పిమ్మట మఠమునకు వచ్చి యథాక్రమముగ శిష్యులకుఁ బాఠములు సాగించుచుండెను. ధ్యానములు సలుపుచుండెను. ఒకదినము శిష్యుని పంచాంగము తెమ్మని గోడయందు గుర్తించెను. అది కడపటిదినము. నాడుదయమున స్వామిలేచి యథాపూర్వముగఁ గాలకృత్యముల నెరవేర్చుకొని 8 గంటలకు పూజామందిరమున కేగి తలుపులు

కిటికీలు మూసికొని (నాడుగాత్రము) నిర్వాతప్రదేశమున 11 గంటలకు ధ్యానమొనర్చెను. క్రిందనున్న శిష్యులందఱు వింతకొనునట్లు కాళీకీర్తనమును గానించెను. మధ్యాహ్న భోజనానంతరము ఒంటిగంటకు శిష్యులకు వ్యాకరణపాఠము చెప్పెను. సాయంకాలము ప్రేమానందునితో వాహ్యాళి వెడలి 2 మైళ్ళదూరము నడచి ముఖ్యములగు విషయముల ముచ్చటించెను. సాయంకాలమైనది. శరీరము చాల తేలికగ నున్నదని శిష్యులకుఁ జెప్పెను. పూజాదికము లొనరించి కొంతసేపు ప్రసంగించి తనగదికి వెళ్ళెను. శిష్యుని బిలిచి జపమాల తెమ్మని చెప్పెను. శిష్యునిద్వారమునొద్ద నుండుమని చెప్పి యేకాంతముగ నొకగంటసేపు జపముచేసెను. తరువాత క్రింద పడకపై పండుకొని శిష్యుని బిలిచి శిరస్సునకు వెనుకవైపు విసరుచుండుమని చెప్పెను. చేతనున్న జపమాల జారి క్రిందపడెను. విసరుచున్న శిష్యుఁడు స్వామి నిద్రించుచున్నాఁడని తలఁచెను. వెంటనే రెండు దీర్ఘనిశ్వాసములు వినవచ్చెను. శిష్యుఁడు భయపడి పరుగెత్తి క్రిందనున్న శిష్యులఁ బిలుచుకొనివచ్చెను. శ్వాసము లేదు, చెవియందు నాడీస్పందనము గనుపింపలేదు. యోగస్థితుఁడని తలచిరి. రామకృష్ణసంకీర్తన మొనరించిరి. కాని చలింపలేదు. వెంటనే వైద్యుని బిలుచుకొనివచ్చిరి. వైద్యుడు స్వామి శరీరమంతయుఁ బరీక్షించెను. చైతన్యము లేదని చెప్పెను. మఱునాఁడుదయమునఁ జూచునప్పటికి దృగ్గోళములయందును, నాసాపుటములందును, వక్త్రమునందును రక్తస్రావము గనుపించెను. వైద్యులు శిరస్సునందలి రక్తనాళము భిన్నమగుటచే నిట్లు సంభవించు ననిరి. యోగులు "స్వామి జపధ్యానములతో బ్రహ్మరంధ్రమునుండి ప్రాణోత్క్రమణ

మొనర్చెనని భావించిరి. స్వచ్ఛామరణము గలుగునట్లు స్వామి వరముపొందియుండిరిగదా. అది స్వామి పంచాంగమును జూచి గోడమీద గుర్తించినదినము 4-7-1902, శుభకృన్నామ సంవత్సర జ్యేష్ఠబహుళచతుర్దశి. స్వామిమూడుదినములకు ముందే సోదరునితో గంగాతీరమున నొకస్థలమును జూపి 'నేను శరీరము చాలించిన నచట దహన మొనరింపు' మని చెప్పియుండెను. మఠ ప్రదేశమంతయు జనులతో క్రిక్కిరిసి తిరునాళ్లవలె నుండెను. స్వామి పాదములకు లత్తుకను పూసి వస్త్రములపై ముద్రలను దీసికొని భద్రపఱచిరి. అపరాహ్ణమునకు స్వామిని క్రిందికి దీసికొనివచ్చి కాషాయములచే గప్పి శిష్యులందఱు నిర్దిష్టప్రదేశమును జేరిరి. చందనకాష్ఠాదులచే చితిని పేర్చి యందు స్వామి శరీరమునుంచి యగ్నిని ప్రజ్వలింపజేసి ప్రదక్షిణముల నొనర్చిరి. దహనకర్మ పూర్తియయినది. సాయంసమయమున శిష్యులందఱిమనములు ప్రశాంతభావము నుద్దీపించెను. ప్రార్థనలు సలిపిరి. చితినుండితీసి కొన్ని యస్థులు భద్రపఱుపబడెను. ఆతావుననే నేడు వివేకానందాలయము వెలయుచున్నది. అందు క్రిందిభాగమున వివేకానందునిచలువరాతివిగ్రహము నెలకొల్పబడియున్నది. పైయంతస్తున ఓంకారము వెలయుచున్నది. వివేకానందస్వామి తనభౌతికశరీరమును త్యజించినను ఆతనిదివ్యబోధనములు నేటికిని సజీవములై ప్రతిమానవుని హృదయమందును సంచలనము నందుచున్నవి. భారతీయులందఱు స్వామిజీవితము నాదర్శముగ గొని భారతదేశౌన్నత్యమును, సనాతనధర్మమును బరిపాలించి వివేకానందులై వెలయుదురుగాక.

---

Printed by the 'Vavilla' Press, Madras-21—1952.

